## జయప్రకాశ్ - అజయ ఘోష్ లేఖలు

భారత దేశంలోని కమ్యూనిస్టులను సంబోధిస్తూ శ్రీ జయ ప్రకాశ్ నారాయణ ఇటీవల 'న్యూయేజ్' వారపత్రికకు వ్రాసిన లేఖ పూర్తిపాఠాన్నీ, దానికి భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ అజయ్‌ఘోష్ యిచ్చిన సమాధానాన్నీ కలిపి యిక్కడ ప్రకటిస్తున్నాం.

## జ య ప్ర కా శ్ లే ఖ

బొంబాయి,

5—11—56.

'న్యూ ఏజ్' సంపాదకులు,

న్యూఢిల్లీ.

ప్రియమైన కామ్రేడ్,

భారత దేశంలోని నా కమ్యూనిస్టు స్నేహితులను సంబోధిస్తూ నేనీక్రింది లేఖను వ్రాస్తున్నాను. నా ఈ సంబోధన పత్రాన్ని 'న్యూ ఏజ్' పత్రికలో ప్రకటిస్తే నాకు గౌరవం చేకూర్చినట్లే భావిస్తాను. దీనిని మీరు ప్రకటించదలిస్తే మాత్రం యథాతథంగా ప్రకటించండి. త్వరలోనే మీనుంచి సమాధానం రాగలదని ఎదురు చూస్తున్నాను.

భవదీయుడు,

జయప్రకాశ్ నారాయణ.

నేను నా కమ్యూనిస్టు స్నేహితులను సంబోధిస్తూ కొన్ని విషయాలు ముచ్చటించ దలిచాను. "స్నేహితులు" అన్నపదాన్ని కావాలనే ప్రయోగిస్తున్నాను. ఎందుకంటే భారత కమ్యూనిస్టుపార్టీలో, ముఖ్యంగా ఆ పార్టీ నాయకులలో, అనేకమంది సన్నిహిత సహచరులుగా నాతోకలిసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో పనిచేసిన వారే.

ప్రపంచవార్తలను పరికిస్తుంటే ఒక సంగతి స్పష్టమవు తుంది: రష్యన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ తర్వాత అన్ని దేశాలలోని కమ్యూనిస్టు వర్గాలలోను ఒక రకమైన విప్లవకర ఆలోచనాధోరణి, కార్యాచరణక్రమం ప్రారంభ మైనట్లు తోస్తున్నది. భారతకమ్యూనిస్టుపార్టీ అందుకు భిన్నంగా లేదనే నమ్ముతున్నాను. ఈ ఆలోచనా, కార్యా చరణక్రమానికి చేయూత నివ్వాలన్నదృష్టితో, స్నేహ భావంతో నేనీలేఖ వ్రాస్తున్నాను.

కృశ్చేవ్ ప్రసంగంలో గర్భితమైయున్న అపారమైన ప్రాధాన్యాన్నీ, ఆటుతర్వాత సంభవించిన ఘటనల ప్రాము ఖ్యాన్నీ ప్రతీ కమ్యూనిస్టు గుర్తించాడనే ఆశిస్తాను. అసలు ఏ ఉద్దేశంతో కృశ్చేవ్ ఆ రహస్యాలన్నిటినీ బయట పెట్టాడు అన్న విషయంలో అనేకరకాల వ్యాఖ్యానాలు వెలు వడినై; ఉద్దేశాలు ఏవైనాకావచ్చు; అసలు అవి అంత ప్రధా నమైనవి కాకపోయినా, రాజకీయమైనవసటంలో మాత్రం సందేహంలేదు. మొత్తం ప్రపంచమంతా ఆదర్శప్రాయమైన రాజ్యంగా పరిగణింపబడుతున్న దేశంలోని నాయకత్వం,వింటేనే గుండె లవిసిపోయే నేరాలు ఒక తరంపాటు కొనసాగించిందని

అధికారరీత్యా అంగీకరించారు. అదే ముఖ్యంగా గమనించవలసిన విషయం. దేశదేశాలలోని కమ్యూనిస్టులను ప్రజలు నిలవేసి, ఇలా ప్రశ్నించక మానరు : "ఇంతకాలంగా మీరు మాచేత నమ్మింపజూచినది ఈ భయంకరమైనదానినేనా ?"

## క్రుశ్చేవ్ బయటపెట్టిన వాస్తవిక విషయాలు

మొదట కమ్యూనిస్టులు ఈక్రింది ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసివుంటుంది. క్రుశ్చేవ్ బయటపెట్టిన వాస్తవ విషయాలు యింతకాలం తమకు తెలియకుండా దాచిపెట్టటం ఎలా జరిగింది ? దాదాపు మూడు దశాబ్దాలనుంచి మొత్తం కమ్యూనిస్టేతర ప్రపంచమంతా ఈ వాస్తవికవిషయాలను గురించి చెప్పుతూవచ్చింది గదా ? క్రుశ్చేవ్ బయటపెట్టిన "రహస్యాలు" అసలు రహస్యాలుకానేకావు. కమ్యూనిస్టులకు, పోనీ కనీసం వారి నాయకులకైనా, ఈ వాస్తవిక విషయాలు తెలియవనటం దుస్సాహ్యం. అయినప్పుడు వారు ఇంతకాలంగా నోరు మెదపకుండా ఎందుకు కూర్చున్నారు ? ఈ ప్రశ్నకు ఇంతవరకు సంతృప్తికరమైన సమాధానం యివ్వనేలేదు.

మరొక ప్రశ్న : క్రుశ్చేవ్ తమను ఎక్కడిదాకా తీసుకుపోయాడో అక్కడే కమ్యూనిస్టులు ఆగిపోతారా ? సత్యాన్వేషణకు మరింకా ముందుకు సాగబోరా ? సత్యం అన్నది అసలు కమ్యూనిజానికి ఏవిధంగాను ఉపయోగించదా ? అబద్ధాలపునాదులను ఆధారం చేసుకొని కమ్యూనిజాన్ని స్థాపించటం సాధ్యమేనా ? ఉన్న రహస్యాలన్నిటినీ క్రుశ్చేవ్ బయటపెట్టాడా ? కమ్యూనిజం పేరుతో సాగించిన అకృత్యాలన్నింటినీ ఆయన ఖండించాడా ? తానుచేసిన నేరా లన్నింటినీ

ఆయన ఒప్పుకున్నాడా ? కిరోవ్ హత్య నేరమైనప్పుడు, జినోవీవ్, కామనీవ్, రాడెక్, బుఖారిన్, తదితరుల హత్యల మాటేమిటి ? రాజకీయ ప్రత్యర్థులను, వ్యతిరేకులను హతమార్చటంకోసం 'ప్రజాశత్రువులంటూ' లేనిపోని నేరాలను స్టాలిన్ ఆరోపించాడన్నారే? బెరియాపైన, అతని "ముఠా" పైన మోపిన అభియోగంకూడా అలాంటిదేకాదా? "సోషలిస్టు న్యాయశాస్త్రా"నుగుణంగానే వారిని విచారించి శిక్షించారా? మాస్కోలో తయారైన గంతలనే తిరిగి కమ్యూనిస్టులు ధరించి వాస్తవాన్ని చూడ నిరాకరిస్తారా? మళ్ళీ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం కొత్తరకం అబద్ధాలను తారకమంత్రాలుగా స్వీకరిస్తుందా? లేక మార్క్సిస్టు వాస్తవిక దృష్టిని ప్రదర్శించి, మానవమేధస్సుయొక్క విప్లవకర స్వేచ్ఛను ఉపయోగిస్తుందా?

మరొక అతి ముఖ్యమైన ప్రశ్న : కృశ్చేవ్ వర్ణించిన నేరాలు ముప్ఫయి సంవత్సరాలకు పైగా తమ పేరుతో యథేచ్ఛగా కొనసాగించ బడుతూంటే రష్యన్ కమ్యూనిస్టుపార్టీ, రష్యన్ ప్రజలు చూస్తూ ఎలా వూరుకొన్నారు? దానికంతటికీ "వ్యక్తిపూజే" కారణం అని చెప్పటమంటే, మానవుని ఇంగిత జ్ఞానాన్ని అవమాన పర్చటమవుతుంది; మార్క్సిజాన్ని అపహాస్యం పాల్జేయటమవుతుంది. ఇంతవరకు ప్రపంచంలో పుట్టిన అత్యంత సమర్థవంతమైన వ్యక్తులలో స్టాలిన్ ఒకడనటం నిర్వివాదాంశం. అయితే, మార్క్సిజం, కమ్యూనిజం పేరుతో రష్యాలో సృష్టించబడిన సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థ వల్లనే గదా స్టాలిన్ ఆపనులన్నీ చేయగల్గింది అన్న

సందేహానికి తావులేదా? స్టాలిన్‌ని వ్యవస్థనుంచి వేరుచేసి, వ్యవస్థయొక్క మంచి చెడులను ప్రస్తావించకుండా వ్యక్తిని ఖండించటం మార్క్సిస్టు పరిశీలన ఎలా కాగలదు? చారిత్రక దృగ్విషయాన్ని మార్క్సిస్టు దృష్టితో పరిశీలించేవిధం ఇదేనా? కేవలం స్టాలిన్‌ని ఖండించినంతమాత్రాన, వ్యక్తిపూజను దుయ్యబట్టినంత మాత్రాన వ్యవస్థ సంస్కరించబడదు; అది మారిపోదు. ఆ వ్యవస్థను కమ్యూనిస్టుస్వర్గంగా చిత్రిస్తూ ప్రస్తుతిస్తున్నంత కాలం కమ్యూనిజం తనను తానే ఖండించుకుంటూ వుండక తప్పదు.

అందుచేత కృశ్చేవ్ బయటపెట్టిన రహస్యాలను పురస్కరించుకొని నవ్రతమాసకాల కమ్యూనిస్టు విశ్వాసాన్ని తీవ్రంగా పరిశీలించుకోటం ఎంతేని అవసరం. కమ్యూనిస్టులు కోరుతున్న దేమిటి? వారు దేనికోసం పోరాడుతున్నారు? సిద్ధాంతాల కొరకా లేక మానవుల కొరకా? ఒకానొక వ్యవస్థ కోసమా? లేక కొన్ని జీవిత విలువల కోసమా? మీకు అత్యంత ప్రియతమమైనవి సాధనాలా? లేక లక్ష్యాలా? అధికారం హస్తగతం చేసుకోటమే పరమావధా? జాతీయం చేయటం, లేక సామూహిక వ్యవసాయం ఒకానొక లక్ష్యానికి సాధనమా? లేక అదే ఒక పరమావధా? అత్యంత ప్రాధాన్యంగల మానవుడు మీకు పరమావధా? లేక సామాజిక నిర్మాణ నిర్వహణలో అతను కేవలం ఒక పనిముట్టు వంటివాడా?

## జీవితపు విలువలు

స్వల్పవిషయాలపై దృష్టిని కేంద్రీకరిస్తున్న కమ్యూనిస్టులు సమ్యక్ దృష్టిని అలవర్చుకోలేక పోతున్నట్టున్నారు.

తమ చరమ లక్ష్యమేమిటో, తమ మహదాశయాలేమిటో వారు పూర్తిగా మరచిపెట్టున్నారు. పిడుగు పాటులాగా వచ్చిన కృశ్చేవ్ ప్రసంగంతో, కమ్యూనిస్టులు కళ్లు తెరిస్తే, స్వయంగా తెచ్చిపెట్టుకొన్న మాయముద్రనుంచి విముక్తమైతే అది యాదృచ్ఛికంగా జరిగినదే కాగలదు. ఏదిఏమైనా కమ్యూనిస్టు లక్ష్యానికి అదొక మహోపకారంగా ఉపకరించి తీరుతుంది.

కమ్యూనిజం ఏయే జీవితపు విలువలను లక్ష్యంగా పెట్టుకొని బయలుదేరింది ? మానవస్వేచ్ఛ, మానవ గౌరవం, మానవ సహోదరత్వం, సరి సమానత్వం, శాంతి – వీటికోసమే కదా ? కమ్యూనిజం ఆశించిన స్వాతంత్ర్యం ఎట్టిదో మరొకసారి గుర్తుతెచ్చుకోండి ! కడకు రాజ్యాంగయంత్రమే పూర్తిగా అంతరించిపోయే మహోన్నత స్వాతంత్ర్యాన్ని కమ్యూనిజం ఆశించింది గదా ! "మానవ పరిపాలన" స్థానే "విషయ పరిపాలన" నెలకొనాలనేగదా అది ఉద్ఘోషించింది? "ఎవరు చేయగలిగినపని వారు చేస్తూ, ఎవరికి కావలసింది వారు అనుభవించాలి" అన్న మహదాశయంలో పరిపూర్ణమైన సరిసమానత్వం వ్యక్తంకావటంలేదా ? మానవ సహోదరత్వంతో మొత్తం మానవజాతి పులకితం కావాలనేగదా అభిలషించేది ? "విప్లవకర దౌర్జన్యం", శ్రామికవర్గ నియంతృత్వం, కేంద్రీకృత ప్రజాస్వామ్యం, జాతీయం చేయటం, సామాజిక మొనర్చటం – ఇవన్నీ కూడా ఆ మహత్తర లక్ష్యాలను సాధించటానికే గదా ఉద్దేశించబడినవి ? ఆ మహత్తరలక్ష్యాలసంగతేమి ? అవి యింకా అసలు మీ దృష్టిపథంలో మిగిలాయా ? విప్లవానంతరం నలభై యేళ్ళతర్వాతకూడా మానవ స్వాతంత్ర్యం,

మానవ గౌరవం కాలరాయబడటం చూస్తున్నాం. రాజ్యాంగ యంత్రం క్రమేణా అంతరించిపోవటానికిమారు, అదొక బలీయమైన పెనుభూతంగా పరిణమించింది. అంతర్జాతీయ సోదరత్వం చివరకు కొత్తరకం వలసవిధానంగా దిగజారింది. ప్రస్తుతం పోలిష్ దేశస్తులు, హంగేరియన్లు-అంతకు పూర్వం యుగోస్లావియా ప్రజలు యీకొత్తరకం వలసవిధానానికి వ్యతిరేకంగా ధీరోదాత్తంగా పోరాడుతున్నారు. యుద్ధసన్నాహం శాంతికి మారుపేరుగా మారింది.

ఈ విషయాలన్నింటినిగురించి భారతదేశంలోని నా కమ్యూనిస్టు స్నేహితులు ఏమని ఆలోచిస్తున్నారా అని చకితుణ్ణవుతున్నాను. కళ్ళు తెరచి, సత్యం కానండీ అని చెప్పినందుకు, నావంటి సామాన్యులను వారు అనేక సంవత్సరాలపాటు దూషించారు. నిందించారు. ఇప్పుడు తమ గంతలను కమ్యూనిస్టులే చింపేసుకొన్నారు గదా; మరి తమ కళ్ళను ఉపయోగించి సత్యమేమిటో చూడటానికి యింకా వారు నిరాకరిస్తారా? కమ్యూనిస్టు వ్యతిరేకతగానీ, రష్యన్ వ్యతిరేకతగానీ నాకు అక్కరలేదు. భారత సోషలిస్టులు స్టాలినిజాన్నీ, సోవియట్ నియంతృత్వాన్నీ తీవ్రాతి తీవ్రంగా నిరసిస్తూ వచ్చారు; యినా సిద్ధాంతరీత్యా కమ్యూనిజాన్ని వారు వ్యతిరేకించనేలేదు. కమ్యూనిజం నియంతృత్వం రూపంలోకి దిగిజారిపోలేదన్న సూచనలు కన్పించినప్పుడల్లా, తన మూల విలువలను కమ్యూనిజం విసర్జించలేదని తేలినప్పుడల్లా, మేము వెంటనే స్నేహ హస్తం చాచాం. దీనికి తార్కాణంగా యుగోస్లావియా విషయమే చూడండి. ప్రాగ్ మొదలుకొని పెకింగ్

వరకు కమ్యూనిస్టులంతా మార్షల్ టిటోను, కమ్యూనిస్టు యుగోస్లావియాను దూషిస్తున్న సమయంలో, టిటో ఒక "ఫాసిస్టు కుక్క", పశ్చిమ సామ్రాజ్యవాదానికి యుగోస్లావియానమ్మిన బంటు అని నీలాపనిందలు వేస్తున్న సమయంలో, భారతదేశంలో మొట్టమొదట మార్షల్ టిటోకు, కమ్యూనిస్టు యుగోస్లావియాకు నీరాజనాలిచ్చింది నేనే. ఇదే సమయంలో ఒక విషయం చెప్పాలి. యుగోస్లావియాపట్ల మా ఆసక్తి యింకా అలాగే వున్నప్పటికీ, ఇటీవల ఆదేశంలో జరుగుతున్న ఘటనలు కొంతవరకు ఆందోళనకరంగా వున్నవని చెప్పక తప్పదు. సరే అసలువిషయానికివద్దాం. తమ గతాన్ని విసర్జించటానికి, తప్పుడుమార్గాలను విడనాడటానికి, చెత్తను త్రోసిపారేయటానకి, తమ అధికార వ్యామోహాన్ని చంపుకోటానికి అవసరమైన సాహసాన్ని, విప్లవకరభావాన్ని కమ్యూనిస్టులు ప్రదర్శించగలరా? ఆవిధంగా తొలుత కమ్యూనిజం ఏయే మహత్తర లక్ష్యాలను శిరసావహించిందో వాటిని వీరు తిరిగి అందుకోగలరా? కమ్యూనిజాన్ని సజీవమొనర్చి, దానిని వాస్తవమైనదిగా మార్చగలరా?

## సోషలిజానికి సొంతమార్గం చేబట్టగలరా?

ఇతర దేశాలలోవలెనే, ఈదేశంలోకూడా కమ్యూనిస్టులు మాస్కోకు తాబేదారులవలె ప్రవర్తించి, నలుగురితోను నవ్వులపాలయ్యారు. అయితే "సరిసమానత్వం", "స్వాతంత్ర్యం" "జాతీయసర్వం సహాధికారం" అన్న కమ్యూనిస్టుసిద్ధాంతాలలో యిప్పుడు పైరుగాలి తిరిగి వీస్తోంది. అమరమైన

అజేయమైన మానవ భావాన్ని కలకాలం అణచిపెట్టి వుంచటం ఎవ్వరితరమూ కాదు. మానవ స్వాతంత్ర్యానికి శ్రీరామ రక్షగా చివరకు మిగిలేది అదే. అదే యిప్పుడు మరొకసారి రుజువుకావటం మనం చూస్తున్నాం. ఇంతకీ భారత కమ్యూనిస్టులు మాస్కో దాస్యంనుంచి విముక్తులై, సోషలిజానికి తమ సొంత మార్గాన్ని చేపట్టగలరా అన్నదే ప్రశ్న. అసలు మేము ఎప్పుడూ స్వతంత్రంగానే వ్యవహరిస్తూవచ్చామని కమ్యూనిస్టు మిత్రులు జవాబు చెప్పవచ్చు. నిజంగా వారు అలాంటి సమాధానమే చెప్పితే, అది దురదృష్టకరమైన విషయం. ఎందుకంటే తాము చెప్పేది వట్టి అబద్ధమన్న సంగతి వారికి తెలుసు. ఇతరు లెవ్వరూ వారు చెప్పినదానిని నమ్మబోరు. పోలెండ్, హంగరీలలోని స్టాలిన్ తాబేదారులుకూడా సరిగా అలాగే చివరిదాకా చెప్పుతూవచ్చారు. అయితే ఆదేశాలలోని "స్వతంత్ర" కమ్యూనిస్టులు, ప్రజలు వారు చెప్పినదానిలోని బండారాన్ని బయటపెట్టలేదా? అబద్ధాలు చెప్పి సాధించగల ప్రయోజనం లేదన్న సత్యాన్ని కమ్యూనిస్టులు యిప్పటికైనా గుర్తించటం మంచిది మానవుడన్నవాడు అతి విచిత్రమైనజంతువు సదా సత్యాన్వేషణనే అతను సాగిస్తుంటాడు. ఆ సత్యాన్వేషణలోనే మతాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ, తత్వశాస్త్రాన్నీ, కళలను, తదితర విషయాలనూ అతను కనిపెట్టాడు. కమ్యూనిస్టులే కాని యండి, మరెవ్వరైనా కానీయండి, అబద్ధాలను మానవ మనస్సులోకి కొంతకాలంపాటు మాత్రమే జొప్పించగల్గుతారు. చివరకు సత్యాన్వేషణ స్వభావంకల్గిన మానవుడు యదార్థం ఏమిటో తెలుసుకొనితీరుతాడు. అందుచేత కమ్యూనిస్టులు

యిప్పుడు ఎలాంటి అరమరలులేకుండా, చేసిన తప్పిదాన్ని ఒప్పు కోటం మంచిది. అంతర్జాతీయతను తప్పుగా అర్థంచేసుకొని, మాస్కోకు గులాములవలె ప్రవర్తించమని అంగీకరించ టం మంచిది; ఇకనుంచి స్వతంత్రంగా వ్యవహరిస్తామని వారు నీళ్ళు నమలకుండా గట్టిగా ప్రకటించాలి. వారు అలాంటి ప్రకటన చేసినంతమాత్రానే సరిపోదు. తాము స్వతంత్రంగా స్వదేశంపట్ల విధేయతతో ప్రవర్తిస్తున్నట్లు ఆచరణలో నిరూ పించి, ప్రజల విశ్వాసం చూరగొనాలి.

## కమ్యూనిస్టుల కర్తవ్యం

ప్రజల విశ్వాసం చూరగొనటానికి కమ్యూనిస్టులు చేయవలసిన మొదటి పని ఇది : రష్యాలో జరిగినదానితో మరి జరుగుతున్న దానితోను తాము ఏయే విషయాలలో భేదిస్తు న్నారో వారు స్పష్టంచేయాలి. రష్యాను తప్పుపట్టటానికి వీలు లేని భూతల స్వర్గంగా వారింతకాలం రష్యాను ఆరాధిస్తూ వచ్చారు. ఆ ఆరాధ్య దేవత యిప్పుడు పటాపంచలై పోయింది. ఇంత జరిగిన తర్వాత కూడా, అసలు ఏమీ జరగనే లేదన్నట్టు వారు నటించినా, లేదా అసలు భూతం భూస్థాపితమై పోయింది కనుక యిక అంతా సక్రమంగా జరిగి పోతుందిలే అనినమ్మింప చూసినా, ఇంగిత జ్ఞానంగల వ్యక్తి ఎవరూ వారి మాటలను నమ్మబోడు. అలా చేసినందువల్ల కొంతమందిని కొంతకాలం పాటు గందరగోళ పర్చగలవేమోగానీ, "కమ్యూనిజం" కొద్ది పాటి "పురోభివృద్ధి" సాధించ గలవేమోగానీ, స్వేచ్ఛా, సరి సమానత్వాలు విలసిల్లే వర్గ రాహిత్య సమాజలక్ష్యాన్ని మాత్రం వారు ఎన్నటికి చేరుకోలేరు.

# 11

## హంగరీ సమస్య

ఈ సందర్భంలోనే, ఇటీవల జరిగిన కొన్ని ఘటనలవల్ల కమ్యూనిస్టుల్కి ఒక తక్షణ సమస్య ఎదుర్కొంటూంది. స్వాతంత్ర్యంకోసం, స్వయం నిర్ణయాధికారం కోసం హంగరీ ప్రజలు సాగిస్తున్న పోరాటాన్ని అణచి పారేసేందుకు రష్యా దారుణమైన దాడిని ప్రారంభించింది. భారత కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్యాన్ని బలపర్చుతుందా, లేక దాస్యాన్ని బలపర్చుతుందా? హంగరీ పక్షాన నిలబడుతుందా లేక రష్యాపక్షాన నిలుస్తుందా? ఈ ప్రశ్నకు చెప్పే సమాధానంపై ననేకఃమ్యా నిజం భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

కమ్యూనిస్టులు ఈవిధమైన ఆత్మపరిశీలన చేసుకోనటం ప్రారంభిస్తే, నేను వేసిన ప్రశ్నలు లేదా యిటీవల జరిగిన ఘటనలవల్ల రేగిన సందేహాలు వారికీ కలగ మానవు. వీటన్నిటిలోకి మూలమైన ప్రశ్న ఇది: కమ్యూనిస్టులు తమ తత్వశాస్త్రానికీ, ఆచరణకూ ఇకముందు కూడా అబద్ధాలను, దౌర్జన్యాన్నే ఆధారం చేసుకొంటూరా? నియంతృత్వాన్ని ప్రజాస్వామ్య మంటూ చెబుతుంటూరా? టోగ్లియాటీ మాటల్లో చెప్పాలంటే "పచ్చి నిరంకుశత్వాన్ని" లేదా ఇతర మాటల్లో చెప్పాలంటే, ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాన్ని సామ్యవాదం అని మీరింకా అంటూరా? వలస విధానాన్ని విప్లవం అని వర్ణిస్తుంటూరా? కళ్ళపై పొరలు తొలగించుకొని వాస్తవాన్ని కానరా? సత్యాన్వేషణకు మీరు ఉపక్రమించరా? అన్నిటికంటె ముఖ్యంగా, హింసను వర్జించకుండా మీరు ఈ

పనులన్నీ చేయగలరా? హింస అన్నది విప్లవానికి దగ్గర దారిగా కన్పిస్తుంది. మరి రష్యాలో మితంలేని హింసాకాండ జరిగినా, అక్కడ విప్లవం ముగిసిందా? లేదనే చెప్పాలి. దీనిని గుర్తించ నిరాకరించటం అంటే, విప్లవం అంటే ఏమిటో సరిగా అర్థంచేసుకోక పోవటమే అవుతుంది. తమ ఆరాధ్య దేవత ఒక వైపున కూలిపోయినా, కళ్ళు మూసుకొని అది కూలిపో లేదనుకోటమే అవుతుంది; నలుపును తెలుపుగా వర్ణించటమే అవుతుంది. కేవలం ఆర్థికాభివృద్ధిని, పోనీ అత్యంత త్వరితగతిని ఆర్థికాభివృద్ధిని, సాధించినంత మాత్రాన అది కమ్యూనిజం, సోషలిజం అయిపోతుందా? అయితే పెట్టుబడిదారీ విధానం క్రింద, ఫాసిజం క్రింద కూడా ఆర్థికాభివృద్ధి త్వరితంగా సాధించబడిన ఉదంతాలు అనేకం ఉన్నాయిగా మరి? సోషలిజం, కమ్యూనిజం అంటే ఒకరకమైన జీవన విధానమేకాని, కేవలం ఉత్పత్తిలెక్కలు, సైనికబలం మాత్రమేకాదు. అంటే కమ్యూనిజం, సోషలిజం ఆర్థికాభివృద్ధిని లక్షించవని మాత్రం అర్థం చేసుకోరాదు. అయితే విలువను పణంగాపెట్టి, ఆర్థికాభివృద్ధిని సాధించటం పనికిరాదు.

అసలు అబద్ధాలు, హింసకూడా మొదట "శత్రువుపైన" జారిస్టువ్యవస్థకు వ్యతిరేకంగాను ఉపయోగించటానికే ఉద్దేశించబడ్డాయి. కాని, రానురాను అవి రెండూ అలవాటుగా, అందులోను నరనరాన జీర్ణించుకుపోయిన అలవాటుగా — పరిణమించాయి. అబద్ధాలు, హింస ప్రజలపైన పార్టీపైన పరస్పరం ఒండొరులపైన ప్రయోగించబడ్డాయి; ప్రయోగించబడుతున్నాయి.

కమ్యూనిస్టులతోపాటు యింకా అనేకమంది, ఉదాహరణకు బూర్జువా ప్రజాతంత్రవాదులైన ఈడెన్ వంటివారు, మోలే నాయకత్వానగల ఫ్రెంచి సోషల్ డెమోక్రాట్లు అబద్ధాలను, హింసను అలవర్చుకోవలసి రావటం నిజంగా చెడ్డ విషయమే. చెడుగుణం చెడుకే దారితీస్తుంది. అయితే కమ్యూనిస్టులు తాము మరింత ఉత్తమమైన దానికోసం నిలబడ్డట్టు చెప్పుతుంటారు గదా? అధికతరంగా అబద్ధాలను, హింసను అలవర్చుకోటం ద్వారా వారు ప్రపంచానికి ముక్తిమార్గం చూపలేరని నేను మనవి చేస్తున్నాను.

## హింస, అహింస

కమ్యూనిస్టులకు సత్యాహింసలు ఉపదేశిస్తున్నందుకు నన్ను అవహేళన చేస్తారన్న సంగతి నాకు తెలుసు. అయినా నాకు మానవ హేతువాదంలో విశ్వాసం వుంది. కమ్యూనిస్టులు కూడా హేతువాదులైన మానవులేనని నా నిశ్చితాభిప్రాయం. నేటి అణుయుగంలో, ప్రపంచ యుద్ధంవంటి మారణహోమాన్ని ఎలాగైనా సరే నివారించి తీరాలి! అన్న నిశ్చయానికి ఇంగిత జ్ఞానం కలవారంతా వచ్చారు. పెద్దఎత్తున హింసాకాండ సాగించినందువల్ల ఎవరికీ ఎలాంటి ప్రయోజనం చేకూరబోదని ఈరోజున అంతా గుర్తిస్తున్న విషయమే. కాని, చిన్న ఎత్తు హింసాకాండవల్ల లాభించవచ్చునేమో అన్న ఆశ యింకా కొందరిలో మిణుకుమిణుకు మంటూనేవుంది. చిన్నపాటి హింసాకాండ సాగుతున్నప్పుడు, భారీహింసాకాండ నివారించటం సాధ్యంకాదన్న సంగతి గ్రహించటం ఏమంత

కష్టంకాదు. చిన్నపాటి హింసాకాండ చివరకు భారీ హింసాకాండగా పరిణమిస్తుంది. కేవలం కమ్యూనిస్టులు మాత్రమే కాక, చివరకు తుపాకి ప్రియులైన మన పాలకులతో సహా - ఇంకా అనేకమంది ఈగుణపాఠాన్ని గ్రహించవలసి వుందన్న విషయం నేను స్పష్టం చేయదలచుకొన్నాను. అయితే శాంతి, సహోదరత్వం కోసమే తాము నిలబడుతున్నామని చెప్పే కమ్యూనిస్టులు, తమ నిజాయితీని ఋజువు చేసుకొనేందుకు, ఇతరులకన్నా ముందుగా ఈగుణపాఠాన్ని స్వీకరించాలి.

ప్రస్తుతమున్న కమ్యూనిస్టు ప్రభుత్వాలన్నీ కూడా హింసాకాండలోనుంచి - భౌతికమైన హింసాకాండలోనుంచి - ఉద్భవించినవే. ఆ ప్రభుత్వాలు నెలకొన్నప్పటినుంచి యింత వరకు ప్రజాభిప్రాయానికి ఎన్నడూ తలొగ్గలేదు. ఆ దేశాలలో ఎన్నికలు జరిగిన మాట నిజమే. అయితే ప్రతిపక్షాలు, పౌర స్వత్వాలు లేకుండా ఆ ఎన్నికలు జరిగాయి. ఒక విధంగా చూస్తే అవి హిట్లర్ జరిపించిన ఎన్నికలను పోలివున్నాయి. కమ్యూనిస్టులు హిట్లర్‌ను ఖండించటమైతే ఖండించారుకాని, తమ ఏకపక్ష పాలనను మాత్రం కొత్త తరహా ప్రజాస్వామ్యం అంటూ సమర్థించుకొన్నారు. పశ్చిమ రాజ్యాలలో ఉనా మున్న రాజకీయ పార్టీల వ్యవస్థ ప్రజాస్వామ్యానికి అసర్వ ప్రాయమైనది కాకపోవచ్చు; ఏమైనా అది ఏకపక్ష వ్యవస్థ కన్నా చాలా మెరుగు. ప్రజలిచ్చే ప్రజాస్వామిక తీర్పుకు బద్ధులై వుంటారా, లేక బలప్రయోగం సాగిస్తూ పరిపాలన సాగించటానికి ప్రయత్నిస్తారా అని భారతప్రజలు కమ్యూనిస్టులను ప్రశ్నిస్తారు?

భౌతికమైన హింసాకాండతోనే కథ పూర్తికాదు. ప్రభుత్వం సాగించే 'న్యాయశాస్త్ర' దౌర్జన్యం కూడా వుంది. ఇందుకు ఈ క్రింది ఉదహారణ చూడండి: రష్యాలోని రైతులకు పరిపూర్ణమైన స్వేచ్ఛను ఒసగినపక్షంలో, వారిలో అత్యధికులు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలనుంచి వైదొలుగుతారనిరష్యన్ వ్యవసాయకరంగాన్ని గురించి పరిశీలన జరిపినవారు పదేపదే స్పష్టం చేస్తున్నారు. వారు ద్వేషభావంతో ఆమాట అంటూవుండవచ్చు; లేదా కమ్యూనిస్టులు సర్వసాధారణంగా ప్రయోగించే పదజాలంలో చెప్పాలంటే "ఫాసిస్టు నిందాప్రచారం"కావచ్చు. ఏమైనప్పటికీ ప్రణాళిక, ఉత్పత్తి సోషలిజం పేరుతో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను యిష్టంలేని రైతులపై బలవంతాన రుద్దటం ఎలా సమర్ధనీయం?

మీకు యేది పరమావధి? పార్టీయా లేక ప్రజలా? సిద్ధాంతమా? లేక మానవుడా? నిజమే; ప్రజలు తమకు ఏది శ్రేయస్కరమో అర్ధంచేసుకోలేని అవివేకులే కావచ్చు. అయినంతమాత్రాన వారిపై తన అభిప్రాయాలను బలవంతాన రుద్దే హక్కు ఏ ఒకరికైనా వుందా? అత్యధికుల అభిప్రాయాన్ని అల్పసంఖ్యాకులపై బలవంతాన రుద్దటంకూడా ఆదర్శప్రాయమైన ప్రజాస్వామ్యం కాదేమోననినా అభిప్రాయం. మహా అయితే అది పరిమితమైన ప్రజాస్వామ్యం కాగలుగుతుంది. కాని, అల్పసంఖ్యాకుల అభిప్రాయాలను అధికసంఖ్యాకులపైన బలవంతాన రుద్దగం నిరంకుశత్వం మాత్రమే అవుతుంది. అలాంటి నిరంకుశత్వాన్ని ఖండించటానికి భారత కమ్యూనిస్టులు సిద్ధంగా వున్నారా?

# సామాజిక కృషి పరమాశయం

ఇప్పటికే సుదీర్ఘమైన ఈ సంభోధనాపత్రాన్ని నేను యింకా పెంచదలుచుకోలేదు. నా కమ్యూనిస్టు స్నేహితులకు మరొకసారి ఈ క్రింది విషయం గుర్తుచేయదలుచుకొన్నాను. మానవుని నైతిక వికాసం, జీవన పురోభివృద్ధి సాధించుటయే సామాజిక కృషి పరమాశయంగా ఉండాలి. మానవుణ్ణి వెనక్కు నెట్టి, సంస్థను, పార్టీని, సమాజాన్ని, రాజ్యాన్ని, జాతిని, ప్రణాళికను, ఉత్పత్తిని, విజ్ఞానశాస్త్రాన్ని కొండకెత్తి స్తుతించటం విప్లవమూ కాదు; అభ్యుదయమూ కాదు; అది వట్టి అభివృద్ధినిరోధకచర్య. అందువల్ల అలాంటిదానిని తిరస్కరించాలి. నా కమ్యూనిస్టుసోదరులు ఇందుకు అంగీకరిస్తారా ?

నా స్నేహితులు కేవలం ఏదో రాజకీయమైన సమాధానం చెప్పుకొని సంతృప్తిచెందరనే నేను ఆశిస్తున్నాను. కమ్యూనిస్టుల ఆలోచనాధోరణి, భావ ప్రకటనారీతి నాకు చిరపరిచితాలే. వారు నాకు ఘాటైన సమాధానం యివ్వాలనుకొంటే యివ్వగలరు. కాని ఆ పనిచేయటం శుద్ధదండుగ అవుతుంది. అందుచేత నన్ను వాదనలో ఓడించాలన్న దృష్టితో వ్యవహరించవద్దనీ, నేను వెలిబుచ్చిన సందేహాలను గురించి దీర్ఘంగా ఆలోచించమనీ నా మిత్రులకు మనవిచేస్తున్నాను. కొన్ని సందర్భాలలో నేను కఠినమైన పదజాలాన్ని ప్రయోగించినట్లు కన్పించవచ్చు. అయినా అత్యంత స్నేహభావంతోనే ఈ లేఖను వ్రాశానని మాత్రం అందరికీ స్పష్టం చేయదలచుకొన్నాను.

# అజయ ఘోష్ సమాధానం

ప్రియమైన కామ్రేడ్ జయప్రకాశ్, నవ. బరు 5వ తేదీన మీరువ్రాసిన ఉత్తరం చేరింది. అందుకు ధన్యవాదాలు,

ప్రజా సోషలిస్టు పార్టీలోని మీరు, ఇతర మిత్రులు, కమ్యూనిస్టుపార్టీ సభ్యులమైన మేము, ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకునేందుకు ఈలేఖ ప్రారంభం కాగలదని ఆశిస్తున్నాను. అలా తెలుసు కోవటం ఎంతో అవసరం కూడా. సోషలిజాన్ని కోరే మనమందరమూ ప్రస్తుతం అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాము. ఆ సమస్యలపై మన మధ్యగల విభేదాలు కూడా తీవ్రమైనవే. కాని మన అంతిమ లక్ష్యం మాత్రం ఒకటే; కనుక ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకోవటం మనకు మాత్రమేగాక మన ఉద్యమానికికూడా ఎంతో లాభం.

ఈ ఉద్దేశంతోనే మీరు పై లేఖను వ్రాశారని భావిస్తున్నాను. మీ లేఖను ఎంతో ఆసక్తితోను, శ్రద్ధతోను నేను చదివాను. దేశంలో ప్రముఖస్థానం వహిస్తున్న ఒక విలువైన స్నేహితుని వద్దనుంచి ఈ లేఖ వచ్చినందువలన మాత్రమేగాక, మేము సైతం తీవ్రంగా ఆలోచిస్తున్న అనేక సమస్యలను ఇందులో మీరు ప్రస్తావించారు కనుక, ఈ లేఖను చాలా శ్రద్ధగా చదివాను.

మీ వాదనలకు ఎదురు వాదనలు చేద్దామనే ఉద్దేశంతో నేనీ సమాధానం వ్రాయటం లేదు. ఆవిషయం ముందుగానే స్పష్టం చేయదలచుకున్నాను. అట్టి వాగ్వివాదం నిష్ఫ

యోజనమని, దండుగ అని నేను పూర్తిగా అంగీకరిస్తున్నాను. కాని మీ లేఖ నాకు ఆశాభంగం కలిగించిందని చెప్పక తప్పదు. అందులోని భావాలు కొత్తవేమీ కావు. కాని అందులో వ్యక్తమైన ధోరణిని మీనుండి మేము ఆశించలేదని చెప్పాలి. మీ ధోరణి లోపభూయిష్టంగా ఉందని, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని గురించి సోషలిస్టు విధానాన్ని గురించి, మీ అంచనా పాక్షికమైనదని మేము భావిస్తున్నాము. మీరు చాల తొందరపాటు నిర్ణయాలకు వచ్చారు. 'స్నేహ పూరిత భావాలతో నే పై లేఖ వ్రాశానని మీరు చెప్పుకున్న ప్పటికి 'చూశావా నామాట నెగ్గింది' అనే మనస్తత్వాన్ని బహుశా అనుకోకుండానే, మీరు ప్రదర్శించారని చెప్పవలసి ఉంటుంది.

## పాక్షిక అవగాహన

వాస్తవ విషయాలపై ఆధారపడి నిర్ణయాలకు రావల సిందిగా మీరు మమ్ములను కోరారు. మంచిదే. కాని పై లేఖలో అట్టి దృక్పథాన్ని మీరు ప్రదర్శించారా? అని మేము ప్రశ్నిస్తున్నాము. మీరు వెలిబుచ్చిన భావాలలో ఎక్కువ భాగం సత్యదూరాలుగా వున్నాయి.

రష్యాలో "విప్లవం జరిగిన 40 ఏండ్ల తర్వాత మాన వుని గౌరవం, స్వేచ్ఛ, మట్టిలో కలిసిపోయాయి." అని మీ రన్నారు. ఇది సరియైన అంచనా కాగలదా?

భూస్వామ్య పెట్టుబడిదారీ విధానాలను, ఒక వ్యక్తి మరొక వ్యక్తిని దోచుకునే సమాజ వ్యవస్థను తొలగించిన విప్లవా నికి మీరు ఏమాత్రం ప్రాధాన్యత ఇవ్వటంలేదు. రష్యాలోను

తదితర సోషలిస్టు దేశాలలోను, వివిధ స్థాయిలలో కార్మికులు, రైతులు, కష్టించే మేధావులు ఎన్నుకోబడిన కమిటీలద్వారా అధికారంలో ఉన్నారనే విషయానికికూడా మీరు ఎట్టి విలువ ఇవ్వడంలేదు.

సోవియట్ విప్లవం ఫలితంగా అంతకుముందు వెనుకబడి యున్న రష్యాదేశం, అన్ని రంగాలలోను గొప్ప అభివృద్ధి సాధించి ప్రపంచంలోని అగ్రరాజ్యాలలో ఒకటైంది. నిరక్షరాస్యత తొలగిపోయి, బ్రహ్మాండమైన సాంస్కృతికాభివృద్ధి సాధించబడ్డది. శతాబ్దాల బానిసత్వంలోనుండి స్త్రీలు బైట పడ్డారు. జారు పరిపాలనలో అణచివేయబడిన జాతులన్నీ స్వేచ్ఛాపూరితమైన ఒక నూతన జీవితాన్ని ప్రారంభించాయి. ఇవన్నీ మీదృష్టిలో స్వల్పవిషయాలా? కొన్ని లోపాలు సోవియట్ రష్యాలో జరిగినమాట నిజమే. అంతమాత్రాన మొత్తం సోషలిస్టు విధానాన్నే మీరు ఖండించడం పూర్తిగా అన్యాయం. విజయాలకు, లోపాలకు గల చారిత్రక కారణాలను పరిశీలించడం అవసరం.

ప్రమాదకరమైన తప్పులు జరిగాయని మేము అంగీకరిస్తాం. వీనిలో చాలావరకు నివారించవీలైనవి; కొన్ని అనివార్యమైనవి. పాతసమాజాలకంటె పూర్తిగా భిన్నమైన ఒక కొత్త వ్యవస్థను నిర్మించే ప్రయత్నంలో చుట్టూవున్న శత్రు దేశాల కుట్రలను తట్టుకునేయత్నంలో అనివార్యంగా—కొన్ని తప్పులు జరిగాయి. ఈపరిస్థితులలోనైతం ప్రపంచంలో ఏదేశం సాధించలేని విజయాలను సోవియట్‌రష్యా సాధించింది. అచ్చట వున్న విధానం, ఎన్నిలోపాలున్నప్పటికీ సోషలిస్టువిధానం.

ఈ విధానం ప్రపంచవ్యాపితంగా గొప్ప ఫలితాలను కలిగించింది. మానవ చరిత్రగతిపైన, మానవుని ఆలోచనాపద్ధతిపైన ఈ విధానం ఎంతో ప్రభావాన్ని కలిగించింది.

ఈవిధంగా అభిప్రాయపడేవారం మేము ఒక్కరమే కాదు. రవీంద్రనాథ ఠాగూరు, రోమారోలావంటి ప్రసిద్ధ వ్యక్తులుకూడా ఇదేభావాన్ని వెలిబుచ్చారు. మీ పార్టీనాయకులుకూడా కొందరు ఇవే భావాలను వెలిబుచ్చారు. 1934 మేలో జరిగిన అఖిలభారత సోషలిస్టుపార్టీ మహాసభకు అధ్యక్షత వహిస్తూ ఆచార్య నరేంద్రదేవ్ ఇలా అన్నారు:

"సోషలిజం కేవలం సిద్ధాంతం, ఆశయంగా మాత్రమే వుండేరోజులు గతించాయి. కనీసం ఒకదేశంలో అది ఆచరణలో పెట్టబడుతున్నది. మనకళ్ళఎదుటనే రష్యాలో ఒక కొత్త పరిశోధన జరుగుతున్నది. దానిని మనం అధ్యయనం చేయాలి. మన కిష్టమైన నిర్ణయాలకు మనం రావచ్చు. నిరుద్యోగ సమస్యను పూర్తిగా పరిష్కరించిన దేశం ఒక్క రష్యాయే. సోషలిస్టు సమాజానికి పునాదులు అక్కడ దృఢంగా నిర్మించబడ్డాయి. చుట్టూవున్న శత్రుదేశాల కుట్రలను తట్టుకొని పెట్టుబడిదారీప్రపంచం అంతా ఆర్థిక సంక్షోభంలో ఉన్నప్పటికీ, సోవియట్‌రష్యా త్వరితగతిని పురోగమిస్తున్నది. రష్యా ప్రపంచానికివ్వగల సందేశం ఒకటి ఉన్నదని పైవిషయం రుజువు చేస్తున్నది. రష్యా అనుభవం నుండి మనం నేర్చుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయి. సోషలిస్టుసమాజాన్ని స్థాపించబూనుకునే ఇతరులకని ఇందువలన చాలా తేలికవుతుంది."

పై అంచనా అంతా తప్పు అని మీరు అనగలరా?

ఈనాడు సోషలిజం అనేభావం మానవకోటి సంతతినీ ఆవరించింది. అన్ని దేశాల ప్రజలు ఈ సోషలిస్టుభావాలచే ఆకర్షింపబడుతున్నారు. పెట్టుబడిదారీవిధానంకంటె సోషలిజం ఉన్నతమైనదని ఆచరణలో రుజువుకాకపోయినట్లయితే ఈ మార్పువచ్చిఉండేదా? ఇలా రుజువుచేయటంలో సోవియట్ రష్యా అత్యంత ప్రధానపాత్ర వహించిన విషయాన్ని మీరు కాదనగలరా?

## ప్రపంచ రాజకీయాలలో రష్యా స్థానం

ఎన్నో కష్టాలను అధిగమించి రష్యా సోషలిజాన్ని నిర్మించింది. అంతేకాదు ఫాసిస్టు కిరాతక చర్యలను డి మానవ కోటిని కాపాడింది. తూర్పు యూరప్ ప్రజాతంత్ర దేశాలకు, చైనాకు, ఆర్థిక పునర్నిర్మాణంలో రష్యా అపారమైన సహాయం అందచేసింది. సోషలిస్టు దేశాలకు, రష్యాకు మధ్యగల సంబంధాలలో సమానత్వ సూత్రానికి కొన్ని విఘాతాలు జరిగినమాట నిజం. కొన్ని తప్పులు జరిగినమాట కుంజావాస్తవం. కాని ఆ లోపాలను సాకుగా తీసుకొని సోషలిజాన్ని ఒక కొత్త రకపువలస విధానం అని మీరు అనటం పూర్తిగా సత్యదూరం. చైనాకు రష్యాచేసిన ఆర్థిక సహాయం వంటిదాన్ని, ఏ సామ్రాజ్య వాద దేశమైనా ఏ వలస దేశానికైనా ఎన్నడైనా చేసిందా?

ఇండియా, ఇండొనేషియా, ఈజిప్టు వంటి దేశాలతో సోవియట్ చేసుకున్న ఆర్థిక ఒడంబడికలను గురించి మీరేమంటారు? తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని ఆర్థిక విధానాన్ని

పటిష్టం చేసుకోవడానికి ఈ ఒడంబడికలు సహాయం చేశాయి. ఈ దేశాలలోని బూర్జువావర్గాలు సైతం సోవియట్ చేస్తున్న సహాయాన్ని ఎంతగానో కొనియాడారు. 'కొత్తరకం వలస విధానం' అనే మీ సిద్ధాంతాన్ని ఈ వాస్తవ విషయాలు బలపరుస్తాయా ?

సోవియట్ రష్యా దృష్టిలో యుద్ధానికి సిద్ధంగా ఉండటమే శాంతి' అని మీరన్నారు. ఇంతకంటె అసత్యం వేరొకటి లేదు. రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం, దురాక్రమణకు గురియైన దేశాల తరఫున నిలబడి శాంతిని రక్షించటానికి పూనుకొన్నది అగ్రరాజ్యాలలో రష్యా ఒక్కటేనన్న విషయాన్ని మీరు మరచిపోయారు. అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించటానికి ఎంతగానో తోడ్పడిన జెనీవా సమావేశాన్ని జరపటంలో రష్యా ప్రముఖపాత్ర వహించింది. అణ్వాయుధాలను, ఇతర దేశాలలో సైనిక కేంద్రాలను రద్దుచేయాలని, నిరాయుధీకరణ జరగాలని రష్యా ప్రతిపాదించింది. వార్సా సంధి అన్నా, సోషలిస్టు దేశాలు సైనికరీత్యా తీసుకునే భద్రతా చర్యలన్నా మీకిష్టం లేకపోవచ్చు. అట్లాంటిక్ ఒడంబడిక పేరుతో సామ్రాజ్యవాదులు ఒక వైపున ప్రత్యక్షంగా యుద్ధ సన్నాహాలు చేస్తుంటే, సోవియట్ యూనియన్ తనకుతానే నిరాయుధం చేసుకోవాలని మీ ఉద్దేశ్యమా ? అలా జరిగితే సోషలిస్టు ప్రపంచ రక్షణ ఏమౌతుంది ? ఈ మధ్య వచ్చిన సంక్షోభంలో ఈజిప్టు పరిస్థితి ఏమయ్యేది? ఈజిప్టు విషయంలో సామ్రాజ్యవాదుల కుట్రలను భగ్నంచేసి, ఆసియా ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్యాన్ని, ప్రపంచ శాంతిని కాపాడటంలో

సోవియట్ రష్యా నిర్వహించిన పాత్రను నేడు ప్రపంచమంతా గుర్తిస్తున్నది.

## రష్యాలో జరిగిన తప్పులు

సోవియట్ రష్యా సాధించిన విజయాలను, ప్రపంచ రాజకీయాలలో అది నిర్వహిస్తున్న పాత్రను నొక్కి చెప్పి, రష్యాలో జరిగిన పొరపాట్లయొక్క తీవ్రతను తక్కువ అంచనా వేయటం మా ఉద్దేశ్యం కాదు. తప్పులు జరిగినంత మాత్రాన సోషలిస్టు సమాజంయొక్క మూల ప్రాతిపదికే మారిపోయి నట్లు భావించరాదనే మా వాదన. మరొక విషయం కూడా ఉంది. సోవియట్ నాయకులు తమంతట తామే ఈ తప్పుల న్నిటినీ ధైర్యంగా అంగీకరించారు. ప్రపంచంలో ఏ ప్రభుత్వమూ ఇంతవరకూ ఇంత ధైర్యమైన పని చేయలేదు. అంతే కాదు. తమ విధానాలన్నిటినీ పునరాలోచించుకొని, తమ ఆలోచన క్రమాన్నంతా తిరిగి పరీక్ష చేసుకొని, తీవ్రమైన సంస్కరణలను ప్రవేశపెట్టే కార్యక్రమం త్వరితగతిన సోషలిస్టు దేశాలన్నిటిలోను నేడు జరుగుతున్నది. మీరు మీ లేఖలో ఈ విషయాలన్నిటినీ వదలివేశారు. లోపాలమీదనే ఎక్కువ కేంద్రీకరించారు.

క్రుశ్చేవ్ బైటపెట్టిన విషయాలన్నీ ముందుగా మీ కెందుకు తెలియలేదు ? అని మీరు ప్రశ్నించారు. కమ్యూనిస్టుపార్టీల నాయకుల కందరకూ ఈ విషయాలు తెలుసునని వారు ఇంతవరకూ వాటిని దాచిపెట్టారని మీరు ఆరోపిస్తున్నారు. నిజానికి మాకు ఈ విషయాలేవీ కూడా సోవియట్ నాయకులు తమంతట తాము బైటపెట్టేవరకు తెలియవు.

'కమ్యూనిస్టేతర ప్రపంచమంతా పదూడు దశాబ్దాలుగా ఈ విషయాలన్నీ చర్చిస్తూనే ఉన్నద'ని కనుక వాటిని కమ్యూనిస్టులు అప్పుడే అంగీకరించి ఉండవలసిందని మీరు చేసే వాదనను నేను ఆమోదించలేను. నేను మిమ్ముల్ను ఒక విషయం ప్రశ్నిస్తాను. 'కమ్యూనిస్టేతర ప్రపంచం' ఇంతకాలంగా గుసగుసలు చేసిన విషయాలన్నీ నిజమైనవని మీరు భావిస్తున్నారా? అక్టోబరు విప్లవం తర్వాత 'కమూనిస్టేతర ప్రపంచం' సోవియట్ రష్యాను గురించి చెప్పుకున్న భయానక కథలన్నీ నిజమైనాయా? కుటుంబం విచ్ఛిన్నం చేయబడ్డదని, మత స్వాతంత్ర్యం లేదని, పంచవర్ష ప్రణాళికలు భగ్నమయ్యాయని, సోవియట్ ఆర్థిక విధానం పతనమై పోతున్నదని పైపైకంగా, పారిశ్రామికంగా రష్యా బలహీనపడ్డదని, హిట్లరు దాడినుంచు అది నిలవలేదని – ఇలాంటి కథలు ఎన్ని ప్రచారం చేయబడ లేదు? ఇవన్నీ నిజమైనాయా? కాలేదు గదా! కనుక 'కమ్యూనిస్టేతర ప్రపంచం' మాటల మీదకంటే సోవియట్ నాయకుల మాటలపై ఎక్కువ విశ్వాసం ఉంచామని మమ్ముల్ని నిందించటం ఎందుకు?

## పొ ర పా ట్లు

సోవియట్ రష్యాలో జరిగిన ప్రతిదాన్ని ఒక పెద్ద ఆదర్శంగా భావించడంలో పొరపాటుచేశామని మేము అంగీకరిస్తున్నాము. కమ్యూనిస్టేతర, సోషలిస్టు విమర్శకులు సోవియట్‌రష్యాపైన చేస్తున్న విమర్శలకు మేము మరికొంత విలువ ఇచ్చివుండవలసింది. రష్యాలో జరిగిన ప్రతిదాన్నీ సమర్థించటం, సోవియట్‌విధానంలో ఏదో ఒక విషయాన్ని విమర్శించిన

ప్రతి ఒక్కరిపైన విరుచుకుబడడం అనే దురలవాట్లు, మా పార్టీలోను, ఇతర కమ్యూనిస్టుపార్టీలలోను ఉన్నమాట నిజమే. ఈచెడుధోరణివలన కమ్యూనిస్టు-సోషలిస్టు ఐక్యతకు, సోషలిజం ఆశయానికి సైతం ఎంతటి హానిజరిగిందో మేము పూర్తిగా గుర్తిస్తున్నాము. ఈ చెడు ధోరణిని పూర్తిగా త్యజించడానికి మేము కృతనిశ్చయులమై ఉన్నాం.

అయితే రష్యానుగురించి, మీరిదివరకు చెప్పిందీ, ఇప్పుడు చెబుతున్నదీ పూర్తిగా సరియైనదని మీరు భావించడంమాత్రం తప్పు. రష్యాను 'స్వచ్ఛమైన ఆదర్శం'గా భావించి మేము ఎంతతప్పు చేశామో, రష్యాను భయానకమైన దేశం'గా చిత్రించి మీరూ అంతే తప్పు చేస్తున్నారు. సత్యాన్ని త్రోసిపుచ్చి, మీకు నచ్చని వాస్తవ ఘటనలపట్ల మీరు కళ్లుమూసుకుంటున్నారు. 'మార్క్సిస్టు వాస్తవికత' 'మానవ మేధస్సుయొక్క విప్లవకర స్వేచ్ఛ' అంటే ఇవేనా? ఇవేనా మాకు మీరు ప్రమాణాలుగా చెపుతున్నారు?

సోవియట్ యూనియన్‌పట్ల మీరెలా పాక్షికవైఖరిని అవలంబిస్తున్నారో కమ్యూనిస్టుపార్టీలపట్ల అదేవిధంగా పాక్షికవైఖరిని అవలంబిస్తున్నారు. మీ వాదనప్రకారం, ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలన్నీ మాస్కోచేతిలో కీలుబొమ్మలు. అదే నిజమైతే చైనా విప్లవవిజయాన్ని మీరెట్లా వివరించగలరు? ఫ్రాన్సు ఇటలీలలో ఇతర ఏపార్టీకి లేనంత ప్రజాపునాది కమ్యూనిస్టుపార్టీకున్న విషయాన్ని మీరెలా కాదనగలరు? మన దేశంలో భారత కమ్యూనిస్టుపార్టీకిగల ప్రముఖస్థానానికి ఏకారణం చెప్పగలరు?

## కమ్యూనిజం వ్యాప్తి

మీరనుకున్నట్లు కమ్యూనిస్టుపార్టీలు మాస్కో చేతిలో కీలుబొమ్మలై నట్లయితే, అవి అసలు అభివృద్ధి అయ్యేవేకావు. ఏవో ముఠాలుగా ఉండేవి. దారుణ నిర్బంధ విధానాన్ని దుష్ప్రచారాన్ని తట్టుకొని—అనేక తీవ్రమైన పొరపాట్లుచేసి కూడా—కమ్యూనిస్టుపార్టీలు చాలా దేశాలలో, కార్మికవర్గం లోని అత్యుత్తమ పుత్రులను ఆకర్షించగలిగాయి. లక్షలాది ప్రజలకు నాయకత్వం వహిస్తున్నాయి. కమ్యూనిస్టుపార్టీలు నిజమైన దేశభక్తియుతపార్టీలని చెప్పటానికి ఈ ఒక్కవిష యమేచాలు. కనుక మా గతాన్ని చూసి మేము సిగ్గు పడవలసిందీ లేదు, గతాన్నంతా నిరాకరించటం అంత కంటే లేదు. మేము సాధించిన విజయాలను చూసి మేము నిజంగా గర్వపడుతున్నాము. మా అపార వీరులు చేసిన అశేష త్యాగాలను చూసి గర్వపడుతున్నాము. అయితే .వివిధ రంగాలలో మేము చేసిన తప్పులను మా బలహీనతలనుకూడా గుర్తిస్తున్నాం.

నేను మిమ్ములను మరొక ప్రశ్న వేస్తాను. కమ్యూ నిస్టు ఉద్యమంలోని లోపాలను గోరంతలు కొండంతలు చేసి మీరు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం పైన సోషలిస్టు ప్రపంచం పైనా పెద్ద పెద్ద ఆరోపణలు చేశారు. ఈ లోపాలను, తప్పులను మేముకూడా హృదయపూర్వకంగా గుర్తిస్తున్నాము. ఈతప్పులు ఎందుకు జరిగాయి? ఇకముందు ఇలాంటివి జరగకుండా ఎలా జాగ్రత్తవహించాలి. అని మేము తీవ్రంగా ఆలోచిస్తున్నాము.

అయితే ఇన్ని తప్పులుచేసినా, ఇటీవల కాలంలో కమ్యూనిస్టు ఉద్యమం అభివృద్ధిచెందినంత వేగంగా ఏఉద్యమమూ అభివృద్ధి కాలేదని మీరు గుర్తిస్తున్నారా? ఈనాడు కమ్యూనిజం కేవలం ఒక ఆదర్శం మాత్రమేకాదు; లేక కేవలం ఒకఉద్యమం మాత్రమే కాదు. మూడవవంతు ప్రపంచంలో కమ్యూనిజం జండానేడుఅధి కారంలో ఉంది. ఇదంతా మోసంతో, దౌర్జన్యంతో సాధించ బడ్డదన్ని మీరనవచ్చును. కమ్యూనిజానికి శత్రువులైనవారు, దౌర్జన్యాన్ని మోసాన్ని పెద్ద మోతాదులో వాడగల శక్తి సంపదలు కలిగిలేరా? వాటిని వారుపయోగించలేదా? అయి నప్పటికీ, కమ్యూనిజం విజయవంతమై లక్షలాది ప్రజలఆదరాభి మానాలను పొందిందంటే, దానికి కారణమేమిటో తెలుసుకో నక్కరలేదా? కమ్యూనిజం సాధించిన విజయాలన్నీ 'అసత్యం, వల్లలభించాయని' మీరనడం మార్క్సిజాన్ని రసాభాసంచేయ టమేకదా?

'హేతువాదంకల మానవులు' అని మీరు మమ్మ్మి సంబోధించారు. మేముకూడా మీనుండి హేతువాదాన్నే ఆశిస్తున్నాము. ఆ ప్రాతిపదిక పైననే ప్రపంచ కమ్యూనిజం సాధించిన విజయాలను, జరిగిన లోపాలను మనం సమష్టిగా అధ్యయనం చేయాలి. సరియైన నిర్ణయాలకు వచ్చి, మనబల హీనతలను పోగొట్టుకొని ఉద్యమాన్ని ముందుకు తీసుకు పోగలం.

## పోలెండు - హంగరీలు

రష్యా అవలంబిస్తున్న కొత్త వలసవిధానానికి పోలెండు హంగరీలలో జరుగుతున్న ఘటనలను వుదాహరణగా మీరు పేర్కొన్నారు. రష్యా సహాయంవల్లనే పోలెండు, హంగరీ, తదితర తూర్పు యూరప్ రాజ్యాలు హిట్లర్ శాసనత్వంనుండి విముక్తి చెందాయన్న విషయాన్ని మీరు మరచిపోతున్నారు. తమ దేశాలలోని అభివృద్ధి నిరోధకులను ప్రతిఘటించి సోషలిస్టు పారిశ్రామికీకరణను సాధించుటలో కూడా ఈ దేశాలకు రష్యా అపారమైన సహాయం చేసింది.

రష్యాకు తూర్పుయూరప్ దేశాలకు మధ్య ఏర్పడిన సంబంధాలలో, సమానత్వసూత్రం ఎల్లప్పుడూ పాటించబడలేదన్న విషయం వాస్తవమే. స్నేహసంబంధాలు ఇందువలనకొంత దెబ్బతిన్నమాట నిజమే. ఈ విషయాన్ని సోవియట్‌నాయకులే స్వయంగా అంగీకరించారు. ఆ లోపాలను యిప్పుడు సరిచేసుకుంటున్నారు.

పోలెండులో జరిగిన ఘటనలపట్ల, మావలెనే మీరు కూడా సంతృప్తి చెందారని ఆశిస్తాను. సోషలిస్టు విప్లవ విజయాలను కాపాడుకుంటూనే, అక్కడ మార్పులెన్నో సంస్కరణలను ప్రవేశపెడుతున్నారు. కనుక, సోషలిస్టు దేశాలలో జరిగిన పొరపాట్లకు మూలకారణం సోషలిస్టు ఆర్థికవిధానం లోనేవున్నది అనే మీ వాదన తప్పు అని పోలెండ్ ఘటనలు నిరూపిస్తున్నాయి.

హంగరీ ఘటనలు మాకూ చాలా విచారాన్ని కలిగించాయి. ఈ సమస్యపై మా వైఖరి మాపత్రికలో ఇదివరకే ప్రకటించబడ్డది. పార్లమెంటులోని మా సభ్యులుకూడా మా వైఖరిని వివరించారు. ప్రజాతంత్ర ప్రభుత్వం 11 సంవత్సరాలు అధికారంలోవున్నతర్వాతకూడా ఇట్టి ఘటనలుజరగటం నిజంగా విచారకరం. వెనుకటి హంగరీప్రభుత్వం దేశీయ విధానాలలోను రష్యాపట్ల గల వైఖరిలోను తీవ్రమైన పొరపాట్లను, అకృత్యాలను నేరాలను చేసిందని స్పష్టం.

ప్రభుత్వంలో సంస్కరణలు కావాలనిఆకాంక్షిస్తున్న ప్రజాతంత్ర ఉద్యమంలో, సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో అభివృద్ధి నిరోధకులుకూడా ప్రవేశించటం చాలా విచారకరం. సోషలిస్టువిధానానికే వ్యతిరేకంగా సాయుధ తిరుగుబాటు ప్రారంభమైంది. ఈ తిరుగుబాటును అణచటానికి ప్రభుత్వం సోవియట్ సేనలను పిలవవలసివచ్చింది.

హంగరీ విషయంలో, స్వేచ్ఛా లేక బానిసత్వమా అనేది నేటి సమస్య అని మీరంటున్నారు. నేను మిమ్మలను ఒక ప్రశ్న వేస్తున్నాను. అక్టోబరు 31 తర్వాత హంగరీలో జరిగిన ఘటనలు కూడా స్వాతంత్ర్యం కొరకే జరిగాయని మీరంటారా ? కమ్యూనిస్టులను, కార్మిక వర్గ నాయకులను సకుటుంబంగా తిరుగుబాటు దారులు చిత్రహింసలకు గురిచేసి చంపివేశారు. హార్థీ ఫాసిస్టులు, భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించాలని యత్నించారు. విదేశీ సామ్రాజ్యవాదులు వారికి ప్రోత్సాహం ఇచ్చారు. సోషలిస్టు ప్రపంచానికి వ్యతిరేకంగా హంగరీని ఒక సైనిక స్థావరంగా మార్చదల

చూసు. ఇదంతా స్వాతంత్ర్యంకోసం జరిగిందనే అంటారా? తిరుగుబాటు విజయం పొందితే హంగరీప్రజలకు ఘోరమైన అన్యాయం జరిగి ఉండేది. ప్రపంచయుద్ధ ప్రమాదం హెచ్చేది. సోషలిస్టు ప్రపంచానికే ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడిఉండేది. ఒకవైపున ఈజిప్టు స్వాతంత్ర్యానికి, తద్వారా ఆసియా ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్యానికి సామ్రాజ్యవాదులు ముప్పు తెచ్చిపెట్టిన రోజులలో, రష్యా బలహీనపడి ఉంటే. సోవియట్ జోక్యంవలననే ఈజిప్టులో యుద్ధం నివారించబడిన విషయం అంతా అంగీకరించిన దేకదా !

## టిటో ప్రసంగం

సెటుబడిదారీ విధానం తిరిగి వస్తుందని, సామ్రాజ్య వాదుల జోక్యం యుద్ధప్రమాదాన్ని హెచ్చు చేస్తుందని—చెప్పే యీ మాటలన్నీ, రష్యాయొక్క సామ్రాజ్య వాద వాంఛను కప్పిపుచ్చటానికి చెప్పే కబుర్లు మాత్రమేనని మీరనవచ్చు. అలాగయితే, శాంతియుత చర్చలద్వారా, రష్యా పోలండుల మధ్య పరిష్కారమౌతున్న సమస్యలు, వస్తున్న పెద్ద మార్పులను మీరెలా వివరించగలరు? నవంబరు 16 న టిటో చెప్పిన విషయాలను మీకు గుర్తుచేస్తాను. రష్యా పెత్తనాన్ని టిటో సహించేవాడని మీరు కూడా అనరేముగదా ? టిటో ఇలా అన్నారు.

"నాజీ ప్రభుత్వాన్ని తొలగించిన సోవియట్ సైనిక జోక్యం హంగరీలో సోషలిజాన్ని రక్షించింది. సోవియట్ సేనల ప్రవేశం అవసరం. హంగరీని ఎదుర్కొన్న రెండు ప్రమాదాల

లోకి ఇది తక్కువ ప్రమాదం. ఏమంటే సోవియట్ సేనలు హంగరీలోకి ప్రవేశించక పోయినట్టయితే, అరాచకం, అంతర్యుద్ధం, ప్రతీఘాతక విప్లవం — తద్వారా మరొక ప్రపంచ యుద్ధం — సంభవించేవి."

నేనొక విషయాన్ని అంగీకరిస్తాను. హంగరీలో రష్యా సేనల ప్రవేశాన్ని గురించి విభిన్న అభిప్రాయాలు ఉండటం సహజం. అనివార్యం కూడా. ఎందుకంటే ఈ సమస్య చాలా జటిలమైనది. హంగరీలో ఏర్పడిన పరిస్థితులలో సోవియట్ సేనల ప్రవేశం సరియైనదేనని మాపార్టీ అభిప్రాయపడుతున్నది. హంగరీ ప్రజల క్షేమం, ప్రపంచ శాంతి సోషలిజంలయొక్క క్షేమం, రక్షణకొరకు హంగరీలో సోవియట్ సేనల ప్రవేశం పూర్తిగా అవసరమని మాపార్టీ భావిస్తున్నది. మావైఖరి సరియైనదో కాదో భవిష్యత్ చరిత్ర మాత్రమే నిర్ణయించగలదు. ఏమైనా, హంగరీలో సోవియట్ జోక్యాన్ని విమర్శించిన వారందరినీ, మేముసామ్రాజ్యవాదుల ఏజంట్లు అని అనటంలేదు. వారి నిజాయితీని మేము గుర్తించినట్లే మా నిజాయితీని కూడా వారు గుర్తించాలని ఆశిస్తున్నాము.

హంగరీపట్ల కమ్యూనిస్టుపార్టీలు అవలంబించే వైఖరి పైన కమ్యూనిజం భవిష్యత్తంతా ఆధారపడి ఉందని మీరనటం సమస్యను అతి తేలిక చేయటం మాత్రమే. హంగరీపై సోవియట్ చర్యను విమర్శిస్తే కమ్యూనిస్టుపార్టీలు తమ స్వాతంత్ర్యాన్ని నిరూపించుకున్నట్లు బహుశా మీరు భావించవచ్చు. కాని మేము ఆ వైఖరిని ఆమోదించలేము.

హంగరీలో సోవియట్ జోక్యాన్ని మీరు ఖండించారు. మీ వైఖరి సరియైనదని మీరు అనుకోవచ్చు. కాని ఈజిప్టుపై సామ్రాజ్యవాదుల దురాక్రమణను ఆపుటలో రష్యా చేసిన కృషిని మీరొక్కసారైనా ప్రస్తావించారా ? ఇది విచిత్రం కాదా ? మీ మనస్సులో కొంత దురభిమానం వున్నదనిస్పష్టం కావటం లేదా ?

'శాంతి అంటే యుద్ధానికి సిద్ధమై వుండటమే' అని ఒక్క వాక్యంలో మీరు రష్యా శాంతి విధానాన్ని విమర్శించారు. శాంతి స్థాపనకై రష్యా తీసుకున్న చర్యలను బూర్జువా నాయకులు సైతం హర్షం వెలిబుచ్చగా మీరు మాత్రం ఆ విషయంలో మౌనం వహిస్తున్నారు.

యుగోస్లావియాపై మీరు చేసిన ఒక వ్యాఖ్యానం నాకు ఆశ్చర్యం కలుగజేసింది. యుగోస్లావియా విషయమై లోగడ మేము అవలంబించిన వైఖరి పొరపాటు అనే విషయంలో ఎట్టి సందేహమూ లేదు. అందుకు మీరు మమ్ములను విమర్శించటం కూడా సరియైనదే. ఆ విషయంలో మీరు మమ్ములను ఇంకా గట్టిగా విమర్శించినా నేను బాధపడేవాణ్ణి కాదు. 'ఈమధ్య యుగోస్లావియాలో కొన్ని ఆందోళనకర సంఘటనలు జరిగాయి' అని మీరనటమే నా కాశ్చర్యంగా వుంది. ఏ సంఘటనలను గురించి మీరిలా అంటున్నారో నాకు తెలియదు. సోషలిస్టు ప్రపంచంలోని ఇతర దేశాలతో యుగోస్లావియా సంబంధ సన్నిహిత మౌతున్నందుకు మీరు ఆందోళనపడటం లేదుగదా ? అలా కాదనే అనుకుంటాను. ఏమైనా మీ అభిప్రాయం ఏమిటో మరికొంత స్పష్టం చేయవలసిందిగా కోరుతున్నాను.

# శ్రామికవర్గ అంతర్జాతీయత

మీరొకవైపు సోషలిస్టు రాజ్యాలను, కమ్యూనిస్టు పార్టీలను తీవ్రంగా ఖండించారు. కాని మరోవైపు సోషల్ డెమోక్రసీ-యిది నేడు డెమోక్రటిక్ సోషలిజం (ప్రజాతంత్ర సోషలిజం అనే పేరు పెట్టుకుంది)-యొక్క చరిత్రపట్ల మీరు మౌనం వహించారు. సొంతఆస్తి నిర్మూలన విషయంలోను పేదలపై ధనికుల పెత్తనాన్ని రూపుమాపే విషయంలోను, వలసప్రజల విముక్తివిషయంలోను దాని చరిత్రను గురించి మీరేమీ చెప్పలేదు. అది సమగ్రమైన పరిశీలనకు నిలబడ లేదు గనుకనా? ఎన్నోవిషయాల నది బహిర్గత మొనర్చు తుందిగనుకనా?

మాలో "అంతర్జాతీయతను గురించి తప్పు అవగాహన" ఉన్నదని మీరు విమర్శించారు. ఆ అవగాహనలో అనేక లోపాలుండేవన్నమాట నిజమే. ముఖ్యంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి, యితర కమ్యూనిస్టుపార్టీలకు మధ్య వుండవలసిన సంబంధాలవిషయమై మా అవగాహన లోపభూయిష్టంగానే వుంటూవచ్చింది. కాని మేము బోధించిన, ఆచరించిన అంతర్జాతీయతవల్ల ప్రపంచానికి కొంత ఉపయోగం కలిగిందనే విషయాన్ని మీరు కాదనగలరా?

"ప్రజాతంత్ర సోషలిజమే" శరణ్యమని చెప్పుకొంటున్న బ్రిటిష్ లేబరుపార్టీ టోరీలతో కలిసి భారత జాతీయోద్యమాన్ని అణచివేయుటకు కృషిచేస్తే, భారతదేశంయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యంకొరకు జరిగిన జాతీయపోరాటాన్ని నిర్విరామంగాబలపరు

స్తూవచ్చిన పార్టీ బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ యేనన్న విషయానికి మీరేమి జవాబు చెపుతారు? ఆల్జీరియా ప్రజల స్వాతంత్ర్య సమస్యపైన, సూయజ్ సమస్యపై ఉత్పన్నమైన సంక్షోభంపైన ఫ్రెంచి సోషలిస్టుల వైఖరికీ కమ్యూనిస్టులవైఖరికీ గల వ్యత్యాసాన్ని గురించి మీరేమంటారు? ఈమధ్య బొంబాయిలో జరిగిన ఆసియా సోషలిస్టు మహాసభలో ఇజ్రాయల్ సోషలిస్టు నాయకుడు ఈజిప్టు సమస్యపట్ల ఎట్టి వైఖరి నవలంబించాడో కూడా మీకు జ్ఞాపకం చేయదలచుకున్నాను. అతని వైఖరికీ, ఇజ్రాయల్ కమ్యూనిస్టుపార్టీ వైఖరికీ ఎంత తేడా వుందో గమనించవలసిందని కోరుతున్నాను. (న్యూఏజ్ 1956 నవంబరు 4: పేజీ 13)

ఇట్టి అంతర్జాతీయతకు మేము సిగ్గుపడాలని మీ అభిప్రాయమా? దాన్ని నిరాకరించాలని మీభావమా? మీరలా కోరరనే విశ్వాసం నాకుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి యితర కమ్యూనిస్టు పార్టీలకూ మధ్య, సోవియట్ యూనియన్‌కీ అనేక సోషలిస్టు రాజ్యాలకూ మధ్య వృద్ధిచెందిన సంబంధాల్లో శ్రామికవర్గ అంతర్జాతీయతకు సంబంధించిన సూత్రాలు ఉల్లంఘింపబడ్డాయనడం వేరు. మేము బోధించిన, ఆచరించిన అంతర్జాతీయత నిజాయితీ లేనిదనీ, అర్థరహితమనీ, సోవియట్ యూనియన్‌కి దాసోహంచేసే ముసుగు మాత్రమేననీ చెప్పడం వేరు. విపరీతమైన అతిశయోక్తులతో చిత్రింపబడే ఒక అర్ధసత్యం అసత్యం కన్న ఎక్కువగా తప్పుదారులు పట్టిస్తుందనే విషయాన్ని మీరంగీకరిస్తారనుకుంటాను.

## మానవుడు, వ్యవస్థ, సిద్ధాంతాలు

ఇక మీరు లేవనెత్తిన కొన్ని కీలక సమస్యలను తీసుకుంటాను.

సకల సామాజిక కృషికీ గమ్యం మానవుడు. అతని నైతిక భౌతికాభివృద్ధి అని మీరు నొక్కి చెప్పారు. తర్వాత మీరిలా ప్రశ్నించారు. దేనికొరకు మేం పోరాడుతున్నాం? ఒక వ్యవస్థకొరకా, కొన్ని జీవిత విలువల కొరకా, సిద్ధాంతాలకొరకా, మానవులకొరకా?

మీరు పేర్కొన్న లక్ష్యం సరియైనదే. అయితేదాన్ని మా ముందుంచిన పద్ధతిమాత్రం సరియైనదికాదు; అది వక్రమార్గాలకు దారితీస్తుంది.

మానవుడు సర్వతోముఖంగా అభివృద్ధి చెందాలని కోరడం కొత్తవిషయమేమీకాదు. అన్ని యుగాలలోను మానవజాతియొక్క శ్రేయస్సుకై పాటుబడ్డ మహనీయులందరి కృషికీ యీ కోర్కె చోదకశక్తిగా పనిచేసింది. వారంతా యీ లక్ష్యాన్నే తమముందుంచుకున్నారు. అయితే, యీ లక్ష్యం వర్గరహిత సమాజంలోనే వాస్తవ మవుతుందని మార్క్సిజం నిరూపించింది. అంతేకాదు మానవ ప్రవృత్తిని మార్చడానికి చేసే ప్రయత్నాలవల్లనే, దురలవాట్లకు స్వస్తి చెప్పమని ప్రజలకు ఉపదేశించడంవల్లనే వర్గసమాజం నిర్మూలింపబడదనికూడా మార్క్సిజం బోధించింది.

ప్రజలు కార్మికవర్గ నాయకత్వాన సంఘటితంగా కార్యరంగంలో ప్రవేశించి, కొత్త సామాజిక వ్యవస్థను సృష్టించుకోవాలని చెప్పింది.

ఈ మార్క్సిస్టు మూలసూత్రాన్ని మీరు అంగీకరించినట్లయితే (సోషలిస్టులంతా అంగీకరిస్తారనే నా అభిప్రాయం) కమ్యూనిస్టులు పోరాడేది సిద్ధాంతాలకొరకా మానవుల కొరకా అనీ, వ్యవస్థకొరకా మానవశ్రేష్ఠ విలువలకొరకా అనీ మీరడిగిన ప్రశ్న చాల లోపాలతో కూడుకున్నదని సులభంగా మీరు తెలుసుకొనగలుగుతారు. మానవుడు సర్వతో ముఖంగా అభివృద్ధిచెందడానికీ, మానవజాతి కొన్ని విలువలను సాధించడానికీ ఏది అవసరం అని నిర్ణయించడంలో రాజకీయ సిద్ధాంతాల ప్రసక్తి, సామాజికవ్యవస్థల ప్రస్తావన రాకూడదనే అభిప్రాయం ఆ ప్రశ్న వెనుకవుంది. ఈ అభిప్రాయం అంగీకరిస్తే, ప్రస్తుత సమాజంలోని చెడుగులన్నిటికీ కారణం మానవుని హృదయంలోని చెడుగునా లేననీ, మానవ ప్రవృత్తిని మార్చేందుకు కృషి సల్పితే సరిపోతుందనీ తిరిగి పాత నిర్ధారణకే రావలసియుంటుంది.

అట్టి కృషి ఫలిస్తుందా? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ఇతర దేశాల ఉదహారణలకు పోనక్కరలేదు. మన దేశంలోనే జరిగిన ఘటనలను పరిశీలిస్తే సరిపోతుంది. బ్రహ్మాండమైననైతికశక్తిగలఒకవ్యక్తిమనజాతీయోద్యమానికినాయకత్వం వహించాడు. ఆయన కొన్నిమహోన్నతమైనఆదర్శాలను బోధించడమేగాక, స్వయంగా తన బోధనలను ఆచరించాడు; మొత్తం జాతికే మార్గదర్శి అయ్యాడు. అయినప్పటికీ గాంధీమహాత్ముడు

నడిపిన ఉద్యమం విజయాన్ని సాధించటం ద్వారా భారత దేశంలో స్థాపించబడిన రాజ్యాంగ యంత్రం ఆయన ప్రియ శిష్యులచే నడుపబడుతున్నప్పటికీ, ఆయన బోధించిన నైతిక విలువలను మాత్రం అది కాపాడ్డంలేదు. మీరే కదా! మన ప్రస్తుత పాలకుల్ని దౌర్జన్యోపాసకులని చెప్పారు? ఇందుకు కారణం వారి ప్రవృత్తిలో సహజంగా వున్న చెడుగుణా లంటారా లేక వారు ప్రాతినిధ్యం వహించి కాపాడుతున్న సామాజిక వ్యవస్థ అంటారా?

అందుచేత మనం సిద్ధాంతాలనూ సామాజిక వ్యవస్థలనూ మానవునినుంచీ, జీవిత విలువలనుంచీ వేరు చేయజాలం. కనుక మీరు పోరాడేది సిద్ధాంతాల కొరకా, మానవుని కొరకా, వ్యవస్థ కొరకా, జీవిత విలువకొరకా—అని మమ్మల్ని ప్రశ్నించడం సరియైనది కాదు. మా లక్ష్యం మానవశ్రేయస్సు అనేమాట ముమ్మాటికీ నిజం. కాని, ఉత్పత్తి సాధనాలపై వ్యక్తిగత యాజమాన్యాన్ని నిర్మూలించే సామాజిక వ్యవస్థలో మాత్రమే, ఆర్థిక సంక్షోభాలనూ, నిరుద్యోగాన్నీ పారద్రోల గల వ్యవస్థలో మాత్రమే, ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధి చేసేందుకు శాస్త్ర విజ్ఞానాన్ని సాంకేతిక నైపుణ్యాన్ని ఉపయోగించ గల వ్యవస్థలో మాత్రమే - మానవుడు సర్వతో ముఖంగా అభివృద్ధి చెందగల్గుతాడు; మనమంతా గౌరవించే నైతిక విలువలను సాధించటం సాధ్యపడుతుంది. అట్టి సమాజాన్ని స్థాపించేందుకవసరమైన ఉద్యమం జయప్రద మవాలంటే, అది కొన్ని సిద్ధాంతాలను అనుసరించాలి. ఆసిద్ధాంతాలు కరడుగట్టిన పిడివాద సూత్రాలుగా ఉండ కూడదు; ఎప్పటికప్పుడు అభివృద్ధి చెందుతూఉండాలి.

## మానవత్వపు విలువల రక్షణ

పెట్టుబడిదారీ వ్యవస్థను, విభిన్నవర్గాలను నిర్మూలించడం ద్వారానే మానవుని సర్వతోముఖాభివృద్ధికి పూర్తి అవకాశాలేర్పడేమాట నిజమే అయినప్పటికీ, యీ సర్వతోముఖాభివృద్ధి దానంతటది అదే సిద్ధించదని మేము యిటీవల జరిగిన ఘటనలవల్ల గ్రహించాం. మేము నేర్చుకున్న పాఠాల్లో యిదొకటి. అందుచేత మేము దాన్ని అంగీకరిస్తాం; సోషలిస్టు వ్యవస్థలో సహితం తీవ్రమైన లోపాలు,అతిక్రమణలు, నేరాలు జరగవచ్చు; ఇట్టివి ఒక దేశంలోనేకాక, సోషలిస్టురాజ్యాల మధ్యగల సంబంధాల్లోసహితం జరగవచ్చు. అవి ఏవిధంగానూ సమర్థనీయం కావు. వర్గాలు రద్దయినతర్వాతకూడా ప్రజాస్వామ్యాన్ని రక్షించేందుకు, దాన్ని విస్తృత పరిచేందుకు మానవత్వపు విలువలను కాపాడేందుకు నిర్విరామంగా, దృఢ నిశ్చయంతో పోరాడవలసిన అవసరం ఉంది. సోషలిస్టువ్యవస్థకు సంబంధించిన అనేక రంగాల్లో అతిక్రమణలు జరక్కుండా కొన్ని హామీలను కలిగించవలసివుంటుంది. అందుకవసరమయే మార్పులనుకూడా తీసుకురావలసివుంటుంది. ఇలా చేసినప్పుడే, విధానాలనుఅమలుజరిపేవిషయంలోనే కాక వాటిని రూపొందించే విషయంలోకూడ ప్రజలు ప్రభుత్వంమీదపూర్తి కంట్రోలును అమలుజరపగల్గుతారు. ఈకర్తవ్యాలను అలక్ష్యం చేసినా, వాటికితగిన ప్రాధాన్యం యివ్వకపోయినా సోషలిజం పూర్తిగావికసించక,మానవహృదయం కుంచింపబడి అణచివేయబడుతుంది. మానవుల అభివృద్ధికి అంతరాయమేర్పడుతుంది; కనుకనే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వమహాసభలో ప్రారంభ

మైనపునఃపరిశీలనాక్రమం సోషలిస్టు దేశాలన్నిటికీ విస్తరిస్తోంది. దానివల్ల కొన్ని ముఖ్యమైన ఫలితాలుకూడా కలిగాయి.

ఈరంగాల్లో యింతవరకు జరిగిన కృషి కొందరికి సంతృప్తి కలిగించకపోవచ్చు. హృదయవిదారకమైన ఆ ఘటన లకుగల కారణాలను యింకా లోతుగా పరిశీలించవలసి యుంటుందని కోరవచ్చు. ఇంకా సమగ్రమైన సంస్కరణలను ప్రవేశపెట్టాలనవచ్చు. ఇటి విషయాలపై మేమూ, సోషలిజా న్నికోరే మీవంటివారూ అంతరం సూచనలు చేయవచ్చు. సోషలిజం అంటే అర్థం మానవుని సర్వతోముఖాభివృద్ధి అని నొక్కి చెప్పనూవచ్చు.

కాని, దురదృష్టవశాత్తూ మీరలా చేయలేదు. సోవి యట్ యూనియన్‌లో జరిగిన అనేక పొరపాట్లను, అకృత్యా లను ఆధారంచేసుకొని మీరు అక్కడ ఏర్పడ్డ సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థనే ఖండిస్తున్నారు. దానిస్థానంలో దేన్ని స్థాపించాలని మీ అభిప్రాయం ? పెట్టుబడిదారీ దేశాల్లో అమలు జరుగుతున్న పేదలను అణచియుంచే ప్రజాస్వామ్యం వంటిదాన్నా ? అది మీలక్ష్యం కాదనే విషయం స్పష్టమే. అయితే మీరు సూచించదలచుకున్న మార్గాంతర మేమిటి ? దాన్ని మీరెలా సాధించ దలచుకున్నారు ?

ఈ కీలక ప్రశ్నలకు సమాధానం మీ లేఖలో సూచన మాత్రంగానైనా ఎక్కడా కనబడదు. మీవైఖరిలో అతి ప్రమాదకరమైన బలహీనత యిదేనని చెప్పదలచుకున్నాను. మీవైఖరిలోనే కాదు; సోషలిస్టు రాజ్యాలపట్ల, ప్రపంచ కమ్యూనిజం యిదివరకే సాధించిన విజయాల పట్ల ప్రతికూల

వైఖరిని ప్రదర్శించేవారందరి దృక్పథంలోనూ యిట్టి బలహీనతే కనిపిస్తుంది.

ఇంతకన్న మరో వైఖరి నవలంబించి ప్రపంచంలోని మూడవ భాగంలో కష్టజీవుల రాజ్యం స్థాపింపబడ్డం మానవ జాతి చరిత్రలో అత్యద్భుతమైన ఘటన అని గుర్తించడం – మంచిది కాదా? సోషలిజం యొక్క అనేక లక్ష్యాలను సాధించడంలో ఇదివరకే గొప్ప పురోభివృద్ధి జరిగిందనీ, అదే సమయంలో ప్రపంచం అనేక ముఖ్యమైన విషయాల్లో సోషలిజం యొక్క లక్ష్యాలను యింకా సాధించలేదనీ, జరిగిన లోపాలను తొలగించుకొని తిరిగి అలాంటివి జరక్కుండా చూచేందుకు కట్టుదిట్టాలు చేసుకోవాలనీ, మన లక్ష్యాలు సిద్ధించడానికవసరమైన చర్యలకు పూనుకోవాలనీ, ప్రపంచ కమ్యూనిజం యొక్క, కమ్యూనిస్టుపార్టీల యొక్క విజయాలను అంగీకరిస్తూనే లోపాలను కూడా వేలెత్తి చూపాలనీ – గుర్తించడం ఎక్కువ ఉపయోగకరం కాదా?

ఇట్టి శాస్త్రీయ దృక్పథాన్ని, నిర్మాణాత్మక వైఖరిని మీనుంచి మేము ఆశించాం. కాని ఆశాభంగం పొందాం.

మీరు తెలియజేసిన అభిప్రాయాలపై తీవ్రంగా ఆలోచించమని మమ్మల్ని కోరారు. తప్పక మేము ఆలోచిస్తాం. కాని, మీరు కూడా గత కొద్ది సంవత్సరాల్లో జరిగిన పరిణామాలను గురించి ఆలోచించి, మీ అభిప్రాయాలను కూడా పునఃపరిశీలించుకోవడం అవసరం కాదా? ఏ సమస్యలపై మీకూ మాకూ మధ్య భేదాభిప్రాయాలున్నాయో ఆ సమస్యలపై మీ వైఖరి పూర్తిగా సరియైనదేనని మీరునమ్ముతున్నట్లు

అర్థమవుతోంది. ఆ వైఖరిని మేము కూడా అంగీకరించాలని మీరు కోరుతున్నారు. ఇది సరియైన వైఖరేనంటారా ? నేటి ప్రపంచ పరిస్థితిని గురించీ, మన దేశంలో సోషలిస్టు ఉద్యమం యొక్క కర్తవ్యాలను గురించీ ఏకాభిప్రాయానికి వచ్చేందుకు మనం కలిసి ప్రయత్నించవలసి యుండగా, అందుకు అనువైన వాతావరణం యిట్టి వైఖరివల్ల ఏర్పడదేమోనని నేను భయపడుతున్నాను.

## మా అభిప్రాయాల్లో సరిదిద్దుకోవలసిన అంశాలు

ఇంతవరకు నేను చెప్పినదాన్నిబట్టి మా అభిప్రాయాలను దిద్దుకోవలసిన అవసరంలేదని నా అభిప్రాయంకాదు. బూర్జువా ప్రజాస్వామ్యం పూర్తి ప్రజాస్వామ్యం కాదనీ, కాజాలదనీ మార్క్సిస్టులు పదే పదే నొక్కి చెప్పారు. దీని అర్థం అంతా వట్టి బూటకమనికాదు. మార్క్సిజం అలా యెన్నడూ చెప్పలేదు. గత వ్యవస్థలన్నిటికన్న అది పెద్ద అభివృద్ధిని సాధించింది. సోషలిస్టులు యీఅభివృద్ధినిగుర్తించి,దాన్ని మరింతముందుకుతీసుకెళ్లాలి.సోషలిస్టువ్యవస్థలోమాత్రమే స్వేచ్ఛ సమానత్వం, సోదరత్వం అనే ఉన్నత సూత్రాలు వాస్తవ రూపం ధరిస్తాయి. ఈ సూత్రాలను ఎల్లప్పుడూ దృష్టిలో వుంచుకొంటూ, వాటిని సాధించడానికి చైతన్యంతో కృషి సల్పకపోతే సోషలిస్టు సమాజం సహితం అభివృద్ధిచెందజాలదు. అలా కృషి సల్పినప్పుడే యితరరంగాల్లో సాధించే అభివృద్ధితో పాటు మానవ హృదయం కూడా వికసిస్తుంది; మనం కోరే నైతిక, మానసిక వికాసం సాధ్యమవుతుంది.

సోవియట్ యూనియన్‌పట్ల మీ వైఖరిని మేము విమర్శిస్తున్నామంటే, మా వైఖరి సరియైనదని వాదిస్తున్నట్లు అర్థంకాదు.

సోషలిస్టు వ్యవస్థ క్రింద సోవియట్ యూనియన్ సాధించిన విజయాలను బలపరచడంతోపాటు మేము సోషలిస్టు ప్రజాస్వామ్యం యొక్క మూలసూత్రాల అతిక్రమణకు సంబంధించిన విధానాలను, పద్ధతులను, చర్యలను కూడా ఖండించియుండవలసింది. కాని మేమలా చేయలేదు. ఈరోజున కూడా మేము సోవియట్ యూనియన్‌ను గుడ్డిగా అనుసరిస్తున్నామని మీరనవచ్చు. ఆ సమస్యపై నేనిదివరకే నా వైఖరిని వివరించాను. దానితో మీరేకీభవించక పోవచ్చు. అయినా అది మా వాస్తవ విశ్వాసమని మీరు అంగీకరిస్తారనుకొంటాను.

సోషలిస్టు ఉద్యమం అన్ని దేశాలకూ వర్తించే కొన్ని సూత్రాలపై ఆధారపడటంతోపాటు ఒక్కొక్క దేశం యొక్క ప్రత్యేక లక్షణాలను, సాంప్రదాయాలను కూడా గుర్తించాలనీ, అట్టి వుద్యమం ద్వారానే సోషలిజం సాధింపబడుతుందనీ మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలు చేసిన బోధనల కనుగుణ్యంగా మేము వ్యవహరించ లేదు. గతంలో మేము చేసిన పెద్ద పొరపాట్లలో ఇది ఒకటి. అంతేకాక, సోషలిస్టు వ్యవస్థ సహితం అనేక రూపాల్లో వృద్ధిచెందుతుందనీ, ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధమైన సోషలిస్టు పంథా వుండవచ్చుననీ మేము గ్రహించలేదు. మన దేశంలో బలప్రయోగం, అంతర్యుద్ధం లేకుండానే సోషలిజాన్ని సాధించడం సాధ్యమని మేము అనేక ప్రకటనల ద్వారా నొక్కిచెప్పాం. ఈ అవ

కాశాన్ని వాస్తవ విషయంగా మార్చేందుకు మేము శాయ శక్తులా కృషిచేస్తున్నాం.

## సోషలిస్టులకు ప్రజాస్వామ్యవాదులకు మా విజ్ఞప్తి

ఆఖరుగా నేను మీకుచేసే విజ్ఞప్తి ఏమంటే ప్రపంచ పరిస్థితి ప్రమాదభరితంగా వుంది. మన దేశంలో కూడ ప్రజల స్థితిగతులు అధ్వాన్నంగా ఉన్నాయి. సోషలిస్టులందరూ, ప్రజాస్వామ్యవాదులంతా ఐక్యతను ప్రదర్శించవలసిన అవసరం నేడెంతో ఉందని గమనించకోరుతున్నాను.

ఈజిప్టులో యుద్ధవిరమణ జరిగినప్పటికీ పరిస్థితి యింకా ఉద్రిక్తంగానే ప్రమాదభరితంగానే ఉంది. సామ్రాజ్యవాదులు తమ పన్నాగాలను వదులుకోలేదు. ప్రపంచ శాంతికి, ఆసియా ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా వారు కొత్త కుట్రలు సాగిస్తున్నారు. వారి ప్రయత్నాలు ఫలిస్తే మన స్వాతంత్ర్యానికి ప్రమాదమేర్పడ్డమేగాక, యిదివరకెన్నడూ కనివిని యెరుగనంతటి భీకరయుద్ధంలో యావత్ప్రపంచమూ యిరుక్కొంటుంది!

మన దేశం ప్రపంచశాంతిని రక్షించే విషయంలోను, వలసవిధానాన్ని ప్రతిఘటించే విషయంలోను గొప్ప పాత్ర నిర్వహించి, అంతర్జాతీయ వ్యవహారాల్లో ఉన్నతస్థాన మలంకరించింది. అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడానికి ఉత్పన్న మయ్యే తగాదాలు శాంతియుతంగా పరిష్కార మయ్యేటట్లు చూడ్డానికి అది ప్రపంచంలోని అన్ని దేశాల ప్రభుత్వాలతో అవి సోషలిస్టు ప్రభుత్వాలయినా, పెట్టుబడిదారీ ప్రభుత్వా

లయినా సహకరిస్తోంది. అయినప్పటికీ మన రెండు పార్టీలూ దేశంలోని యితర సోషలిస్టుశక్తులు ప్రజాస్వామ్యవాదులు ఉదాసీనతతో మెలగడానికి వీల్లేదు. ఈ సమస్యలను కేవలం ప్రభుత్వానికే విడిచిపెట్టి ఊరుకోరాదు. మన మందరంచేతులు కలిపి, బలీయమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించగల్గినప్పుడే, ప్రభుత్వంయొక్క శాంతి చర్యలను, ప్రకటనలను యావద్భారతదేశం శక్తివంతంగా, ప్రజాసమీకరణద్వారా బలపరచగల్గుతుంది. ఉదాహరణకు సామ్రాజ్యవాదుల్ని ఈజిప్టు నుంచి సాగనంపేటందుకు బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించగలుగుతాం. అంతేకాదు. ఐక్యతను ప్రదర్శించడం ద్వారానే మనం ప్రభుత్వవిధానంలోని ఊగిసలాటను, బలహీనతలను తొలగించడానికి సహాయపడగల్గుతాం.

బ్రిటిష్ కామన్వెల్తు యెడల ప్రభుత్వ మనుసరిస్తున్న వైఖరిలో ఇట్టి ఊగిసలాటలు, బలహీనతలు కన్పిస్తున్నాయి.

## ప్రభుత్వ విధానాలు

ఇక అంతరంగిక వ్యవహారాల్లో నేడు ప్రజల్నెదుర్కొంటున్న, ఆర్థిక, రాజకీయ, సాంఘిక సమస్య లెన్నిటినో పరిష్కరించవలసి యుంది. నేడు మనమున్న పరిస్థితి ఎలాంటిదంటే ప్రభుత్వం సరియైన విధానాలను అనుసరించినట్లయితే మన దేశం ఆర్థికంగాను, సాంస్కృతికంగాను వెనుకబడియుండే స్థితిని త్వరితంగా అధిగమించవచ్చు. మన ప్రజలు సుఖ సంపదలతో జీవించేటట్లు చేయవచ్చు. కాని, ప్రభుత్వం నేడనుస

రిస్తున్న విధానాలవల్ల కొన్ని రంగాల్లో మార్పులు జరిగి నప్పటికీ త్వరితంగా యీ లక్ష్యాలను చేరుకోడంలో ఆటంకాలు కలుగుతున్నాయి. ప్రభుత్వం విదేశీ గుత్తవ్యాపారస్తులకు, పెద్ద పెద్ద భూస్వాములకు, భారతీయ బడా పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా కఠినమైన, శక్తివంతమైన చర్యలు తీసుకో నిరాకరిస్తోంది. ప్రజలపై కొత్తభారాలను మోపుతోంది. ఇప్పటికే అధ్వాన్నంగా ఉన్న ప్రజలజీవన ప్రమాణాలపై కొత్తదాడులు సాగిస్తోంది. రైతుల్ని పెద్దయెత్తున భూములనుంచి వెళ్ళగొట్టడం, కార్మికులను, మధ్యతరగతి ఉద్యోగులను రిట్రెంచి చేయడం, ధరలు విపరీతంగా పెరిగి పన్నులభారం ఎక్కువవడం – ఇవీ ప్రభుత్వ విధానంవల్ల కలుగుతున్న కొన్ని ఫలితాలు. పౌరస్వత్వహక్కులు మంటకలుస్తున్నాయి; నియంతృత్వ పోకడలు అధికమవుతున్నాయి.

ఈ విధానాలకు వ్యతిరేకంగా అన్ని వర్గాలకు, తరగతులకు చెందిన అనేకమంది ప్రజలు – కాంగ్రెసు సభ్యులు, కాంగ్రెసు అనుచరులతోసహా ముందుకొస్తున్నారు. ప్రజల్లో సోషలిస్టు భావాలు వేళూనుతున్నాయి. ప్రజల ప్రయోజనాలను రక్షించడానికి, దేశాన్ని ముందుకు తీసుకెళ్ళే విధానాల కొరకు సోషలిస్టులు, దేశభక్తులు, ప్రజాస్వామ్యవాదుల మధ్య విస్తృతమైన ఐక్యసంఘటనను నిర్మించడానికి అవకాశాలు పెరుగుతున్నాయి. మన దేశంలో అందరికన్న ప్రగతిశీలురైన సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఈ కర్తవ్యాలను నిర్వర్తించడంలో నాయకత్వం వహిస్తారని ప్రజలు ఆశిస్తారు.

ఈ కారణా లన్నింటివల్ల మనం ఒండొరులపట్ల అను సరించే వైఖరిని మార్చుకోవలసి యుంటుందనీ, ఒకరి నొకరు అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలనీ, సాధ్యమైనంత ఎక్కువ ఏకీభావం కొరకు కృషి చేయాలనీ స్పష్టమవుతుంది. అలాచేస్తే, భేదాభిప్రాయాలిక ముందు కూడా ఉన్నప్పటికీ వాటిని దీర్ఘ చర్చల ద్వారా పరిష్కరించు కోడానికి ప్రయత్నిస్తూనే, ప్రపంచ శాంతిని రక్షించేందుకు, స్వాతంత్ర్యాన్ని కాపాడు కొనేందుకు, ప్రజలకు సేవ చేసేందుకు ఒండొరులం చేతులు కలిపి పనిచేయగల్గుతాం.

ఈలేఖ అనేకవిషయాల్లో మీరనుకొన్న "రాజకీయ సమాధానం"గానే "ప్రతివిమర్శ"గానే తయారైనందుకు చింతిస్తున్నాను. ఇందుకు మీరు విమర్శించేటట్లయితే నేను చెప్పగల మాట ఒక్కటే: మరోవిధంగా నేను వ్రాయడం కష్టమయేటట్లు చేసింది మీ లేఖ.

అయినప్పటికీ, మీరుగాని మేముగాని యింతటితో ఆగిపోతామనుకోను. ఉత్తర ప్రత్యుత్తరాలతోపాటు మన ఉభయపార్టీల, దేశంలోని యితర సోషలిస్టుపార్టీల నాయ కులు, సభ్యులు తరచు కలుసుకొంటూవుండవచ్చుననీ, ఉమ్మడి సమస్యలపైన ప్రజల్నెదుర్కొనే వివిధ సమస్యలపైన చర్చలు జరుపుకోవచ్చుననీ, సాధ్యమైనప్పుడల్లా సమష్టి కార్యవిధానం కొరకు ప్రయత్నించవచ్చుననీ ఆశిస్తున్నాను. ఈ పరిణామం యిదివరకే ప్రారంభమైంది. అనేక సమస్యలపై మనం కలిసి పనిచేయగలిగాం; కలిసి పోరాడగలిగాం; వర్తమానకాలంలో

దీన్ని అత్యంత ప్రాముఖ్యతగల సంఘటనగా మేము పరిగణిస్తాం. దీన్ని ప్రజాసామాన్యం మెచ్చుకొంది. ఈ పరిణామాన్ని యింకా ముందుకు తీసుకెళ్ళడానికి మీ రాజకీయ పలుకుబడిని, నైతిక ప్రభావాన్ని వినియోగిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు

అభివందనములతో

అజయ్ ఘోష్,

(భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి)

JAYA PRAKASH – AJOY GOSH LEKHALU As. 4/-

# కొన్ని ముఖ్య సిద్ధాంత గ్రంథాలు

| | |
|---|---|
| 1. కమ్యూనిస్టు ప్రణాళిక : మార్క్సు - ఎంగెల్సు | 0—12—0 |
| 2. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర | 5— 0—0 |
| 3. సోవియట్ రష్యా : నూరు ప్రశ్నలు. సమాధానాలు | 1— 8—0 |
| 4. సోవియట్ దేశంలో సామ్యవాద ఆర్థిక సమస్యలు — స్టాలిన్ | 1— 0—0 |
| 5. మార్క్సిజం - దాని పురోగమనం : — పామీదత్తు | 0— 6—0 |
| 6. కార్ల్ మార్క్సు, ఫ్రెడరిక్ ఎంగెల్సు : — లెనిన్ | 0— 8—0 |
| 7. సోషలిజం : ఊహాజనితం. శాస్త్రీయం - ఎంగెల్సు | 0—12—0 |
| 8. రాజ్యాంగ యంత్రం : లెనిన్ | 0— 4—0 |
| 9. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ క్రుశ్చేవ్ నివేదిక | 0—10—0 |
| 10. క్రుశ్చేవ్ నివేదికపై 20 వ మహాసభ తీర్మానం | 0— 4—0 |
| 11. బుల్గానిన్ నివేదిక | 0— 5—0 |
| 12. సుస్లోవ్ ఉపన్యాసం | 0— 2—0 |

ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2